

శ్రీ అరవిందు

# గీతాభూమిక

మానవకళ్యాణము కొఱకు, భారతదేశమును నిర్మించుకొనుటకు తోడ్పడుటే మా లక్ష్యము. మే మాశించునట్టి జాతీయతత్త్వ మదియే. మానవుడు ప్రథమము ఆంతరంగిక రాజ్యమును జయించియే, బాహ్య సామ్రాజ్యమును నిర్మించగలడు. ఆనా డర్జునునిద్వారా శ్రీకృష్ణు డీకార్యమును నెట్లు నెరవేర్చినది, అదియే యీనాడు మన కెట్లు ఉపకరించునది మనకు గీత బోధించుచున్నది. ఈబోధ సనాతనము; సర్వకాలములకు సర్వదేశములకు అన్వయించునది.

అనువాదకులు:

చిమలవాగుపల్లె నారాయణరెడ్డిగారు.

# విజ్ఞాపన

శ్రీ అరవిందులు ఆధ్యాత్మికసిద్ధిని యేకైక లక్ష్యముగా సాధించుటకు ౧౯౧౦-వ సంవత్సరమున పాండిచేరియందు చేరి, ఆ కార్యమున నిమగ్నులైరి. ఈ ఆధ్యాత్మికసిద్ధియొక్క ఉద్దేశ్యము ఫలము, పృథ్వీ జీవితము నందు ఆధ్యాత్మిక యుగమును స్థాపించుటయే యనుట సర్వులకు తెలిసిన విషయమే.

వీరు ౧౯౧౦-కి పూర్వము వంగదేశమునందు జాతీయోద్యమములో పాల్గొనుచుండిరి. ఆసందర్భమున వారు జైలులో (Under-trial) ఖైదీగా నుండినపుడు, శ్రీకృష్ణపరమాత్మని సాక్షాత్కారము చేసికొని యుండిరి. వారు జైలునుండి బైటకు వచ్చినంతనే, జాతీయ ప్రబోధమును ఆధ్యాత్మికభావములపై స్థాపించు నుద్దేశ్యముతో, ధర్మయను వంగభాషా పత్రికయందు, గీతావ్యాసములను ప్రచురించ ప్రయత్నించిరి. దానియొక్క ఫలితమే ఈ గీతాభూమికలోని మొదటి మూడు కల్పములు. అంతలో వీరు పాండిచేరికి పోవుటచే, ఆ వ్యాసములు గీతలోని రెండవ అధ్యాయము ముగియకనే నిలిచిపోయెను.

కాని వారు పాండిచేరియందు వారి ఆధ్యాత్మిక

## విజ్ఞాపన

సాధనాఫలితముగ కలిగిన అనుభవములపై, వారు ౧౯౧౪-వ సంవత్సరమున స్థాపించిన "ఆర్య" యను మాసపత్రికయందు, అనేక ఆధ్యాత్మిక విషయములను ప్రచురించిరి. భగవద్గీతను గుఱించి మరల ఈ మాస పత్రికయందు వ్యాసములను ఐదు సంవత్సరములు వరుసగా వ్రాసియుండిరి. అందులోని ప్రథమాధ్యాయమును, ఈ గ్రంథమునందు చతుర్థకల్పముగా చేర్చబడినది. వారికీ నాలుగు సంవత్సరములలో కలిగిన నూతనానుభవములపై వ్రాయబడిన గీతావ్యాసములకును, తత్పూర్వము వంగదేశములో జాతీయోద్యమసమయమున వారిచే వ్రాయబడిన గీతాభూమికకునుగల భేదము, స్పష్టముగా చదువరులకు గోచరించును. సంపాదకుడీ రెండవ గ్రంథమునుకూడ ప్రచురించ నుద్దేశించియున్నాడు. అయ్యును, ఈ మొదటిగ్రంథమునకు గల విలువ తీసిపోదు. అందుచే దీని నిప్పుడు ప్రకటించియున్నాడు. ఈ గ్రంథము మిగత భారతీయభాషలలో అనేక ముద్రణలను బడసియున్నది. తెలుగుభాషయందుకూడ నిది రెండవ ముద్రణము: దీనిని ౧౯౩౬-వ సంవత్సరమున శ్రీ గొట్టిపాటి వెంకటసుబ్బయ్యగారు అనువదించి మొదటిసారి ముద్రించియుండిరి. సంపాదకుడు దానిని సహాయముగా గొనియు, దీని నిప్పుడు ప్రత్యేకముగా హిందీ గ్రంథము నుండియు, ఆంగ్లగ్రంథమునుండియు అనువదించియు ముద్రించినాడు.

— సంపాదకుడు

# విషయసూచిక

## ప్రథమకల్పము



## ద్వితీయకల్పము

## తృతీయకల్పము



## చతుర్థకల్పము





# గీతా భూమిక

## ప్రథమకల్పము

### ప్రస్తావన

భగవద్గీత ప్రపంచమున మతగ్రంథము లన్నింటిలో శ్రేష్ఠమైనది. గీతయందు సంక్షేపముగా వ్యాఖ్యానింపబడిన జ్ఞానము గుహ్యతమమై చరమావధిని పొందియున్నది. ఇందు చెప్పబడిన ధర్మనీతియందు సకలధర్మనీతులు అంతర్హితమై దానిపైననే ప్రతిష్ఠితమైయున్నవి. దీనియందు పేర్కొనబడిన కర్మమార్గము ప్రపంచము నౌన్నత్యము గావింపగల సనాతనమార్గము.

అసంఖ్యరత్నముల నుత్పన్నముచేయగల అగాధ సముద్రము, గీత. జీవితకాలమంతయు నాసముద్రపు లోతునకుజేరుటకు ప్రయత్నించినను, దాని లోతు తెలియరానిది, ఊహింపరానిది. శతవర్షములు వెతకినను దాని అనంతరత్న భాండారములో సహస్రాంశమైనను పొందుట దుష్కరము. కాని, ఒకటిరెండు రత్నములు మాత్రమే దొరికినను, దరిద్రుడు ధనికునిగను, చింతనా

తత్పరుడు జ్ఞానిగను, భగవద్విద్వేషి భక్తుడుగను మారు దురు. అల్లే శక్తిమంతుడగు కర్మవీరుడు తన జీవితో ద్దేశ్యమును సిద్ధింపజేసికొనుటకై కవచధారియై కర్మ క్షేత్రమున ప్రవేశించి జయమునుగాంచగలడు. అక్షయ ముగ నున్నమణులగని, గీత. యుగయుగముల పర్యంత ము ఈగనిలోని మణులను తీసికొనుచుండినను, ఇందలి నూతన అమూల్యమణి మాణిక్యములు విశ్మితమును సం తుష్టిని కలిగించుచునేయుండును.

ఇట్లుగీత గంభీరగు ప్రజ్ఞాన పూర్ణగ్రంథమైనను దానిభాష మిక్కిలితేలిక ; రచన బహు సరళము. బాహ్యార్థముకూడా కడు సులభము. గీతాసముద్రమున చిన్నచిన్న అలలపై తేలియాడినను, లోపలికి మునుగక పోయినను, శక్త్యానందములు కొంతకుకొంత కలుగుచుం డును. గీతయొక్క రత్నగంభీరలోతులలోనికిపోక, దాని కేవల పరిసరముల సంచరించుచు, అక్కడి గడ్డియందు దాగిన మణుల పొందియును మన మిహజీవితమున ధనికు లము గాగలము. గీతపై వేలకొలది వ్యాఖ్యానము లున్న ను, మఱి కొ్రొత్త వ్యాఖ్యానముల వలన నుపయోగ ముండజాలదను సమయ మెప్పుడును కలుగదు. జగత్ శ్రేష్ఠ మహాపండితుడు లేక జ్ఞాని, యెవ్వరేనియు దానిని తాను హృదయంగమము చేసికొంటిమనియు ఇక గీతపై వ్యాఖ్యానముచేయుట వ్యర్థమనియు, దాని యందలి సర్వార్థమును దెలిసికొంటినని, జెప్పతగిన వ్యాఖ్యానము చేయజాలడు. బుద్ధినంతటిని వ్యయము

చేసినప్పటికిని ఈజ్ఞానమునందలి అల్పాంశముమాత్రమే తెలిసికొనగలడు; ఇతరులకు నంతే తెలుపగలడు. బహు కాలము యోగమగ్నుడైనను, లేక నిష్కామకర్మ మార్గమున ఉచ్చమునుండి ఉచ్చతమస్థానమును పొందినప్పటికిని, గభీరమగు గీతోక్తసత్యములలో నే కొలదియో పొందితినని గాని లేక గీతయందలి నొకటి రెండు సంగతులుమాత్రమే జీవితమున సాధింపగలిగితినని గాని చెప్పగలడు. ఈలేఖకు డెంతవరకు యుపలబ్ధిపొందెనో, దీనియందలి నెంతటి అంశమును కర్మమార్గమున అభ్యసించెనో, విచార వితర్కద్వారమున నెట్టి అర్థమును గ్రహించెనో, దానిని నితరుల సహాయముకొఱకు ప్రకటించుటయే, ఈప్రబంధముయొక్క ఉద్దేశ్యము.

## వక్త

గీతయొక్క ఉద్దేశ్యార్థములు తెలిసికొనుటకు పూర్వము అందలి వక్త, పాత్ర, మఱి యప్పటిసమయ పరిస్థితి తెలిసకొను టావశ్యకము. వక్త భగవంతుడగు శ్రీకృష్ణుడు, పాత్రి ఆయన సఖుడు, వీరశ్రేష్ఠుడు అగు నర్జునుడు. సమయము కురుక్షేత్రమునందలి భీషణ హత్యాకాండారంభము. అనేకులు మహాభారతము రూపకమనియు, శ్రీకృష్ణుడు భగవానుడనియు, అర్జునుడు జీవుడనియు ధృతరాష్ట్రాదులు కామక్రోధాది రిపులనియు, పాండవసేన ముక్తి కనుకూల వృత్తులనియు జెప్పెదరు. కాని ఇందువలన నొకరీతిగ మహాభారతము

నకు కావ్యజగత్తునందొక హీనస్థాన మిచ్చుటయు, మఱొకరీతిగ గీతయొక్క గభీరతను, కర్మజీవనమందు కర్మకుగల ఉపయోగమును, మానవజాతి యున్నతి కది కలిగించెడి శిక్షణను, హ్రస్వపఱచుటయు నష్టపఱచుటయు అగుచున్నది. కురుక్షేత్రయుద్ధము గీతాపటమునకు కేవల మొక కూరుపుకాదు. అది గీతాశిక్షణమునకు మూలకారణము; గీతోక్తధర్మమును పొందుటకు శ్రేష్ఠ క్షేత్రము. కురుక్షేత్రసంగమము కాల్పనికమని తలచినచో, గీతాధర్మమును ప్రపంచమునందు వీరులధర్మముగా నాచరించుటకు నయోగ్యమగును; ప్రపంచమునకు అనుపయోగమై శాంతిసన్న్యాసధర్మముగ నది పరిణతి చెందిపోవును.

గీతకు వక్త శ్రీకృష్ణుడు. శ్రీకృష్ణుడు స్వయం భగవానుడేయని శాస్త్రములు చెప్పుచున్నవి. గీతయందుకూడ శ్రీకృష్ణుడు తాను భగవానుడనేయని చెప్పెను. నాల్గవ అధ్యాయములోని, అవతారవాదమును, పదవ అధ్యాయములోని విభూతివాదమును, అనుసరించి భగవంతుడు సర్వభూతములయందు శక్తి వికాసము కొరకు కొంతగా వ్యక్తమై శ్రీకృష్ణుని శరీరమునందు పూర్ణాంశరూపమున అవతరించినట్లు చెప్పబడినది. అనేకులు, శ్రీకృష్ణార్జునులు కురుక్షేత్రము, రూపకమాత్రమనియు, ఈ రూపకమును విసర్జించి గీతయొక్క అసలు బోధనను మాత్రము స్వీకరించవలెననియు చెప్పుదురు. కాని గీతాబోధయందలి ఈ అంశము

తీసివేయ వీలులేదు. అవతారవాదము సరియగుచో మనము శ్రీకృష్ణుని గురించిన విషయ మెట్లు త్రోసి వేయగలము? అందుచే స్వయముగా భగవానుడే ఈ జ్ఞానమునకు, ఈ బోధనకు ప్రచారకుడు.

శ్రీకృష్ణుడు అవతారపురుషుడే; అతడు మానవ శరీరమును వహించి శారీరక, మానసిక, ఆధ్యాత్మిక ధర్మముల గ్రహించి తదనుసారముగ లీల యొనర్చెను. ఈ లీలాప్రకటనను, ఈ గూఢవిద్యను మనము గ్రహింప గల్గినచో, ఈ జగద్వ్యాపక లీలార్థమును, ఉద్దేశ్యము ను ప్రణాలిని తెలిసికొందుము. ఈ మహత్ లీలయొక్క ప్రధానాంశము పూర్ణజ్ఞాన ప్రవర్తిత కర్మ; ఆకర్మ మధ్యమునను, అట్లే ఆ లీలయొక్క మూలమునందును, ఎట్టిజ్ఞానము నిహితమైయున్నదో, అదియే గీతయందు ప్రకాశిత మొనరింపబడినది.

మహాభారతమున శ్రీకృష్ణుడు కర్మవీరుడు, మహాయోగి, మహాసంసారి, సామ్రాజ్యసంస్థాపకుడు, రాజనీతిజ్ఞుడు, యోధుడు, క్షత్రియదేహమున బ్రహ్మ జ్ఞాని. ఆయనజీవితమున మహాశక్తియొక్క అతులనీయ వికాసమును, రహస్యమయ క్రీడను, జూడగలము. ఈ రహస్యముయొక్క వ్యాఖ్యయే గీత. శ్రీకృష్ణుడు జగ త్ప్రభువు; విశ్వవ్యాపియునగు వాసుదేవుడు. అయ్యును తన మహిమను, ప్రచ్ఛన్నముగనుంచి, పితృ, పుత్ర, భ్రాతృ, భర్త, మిత్ర శత్రుసఖాది సంబంధములను స్థాపించి లీల యొనర్చెను. ఆయనజీవనమునందు ఆర్య

జ్ఞానముయొక్క శ్రేష్ఠ రహస్యము, భక్తిమార్గము యొక్క ఉత్తమబోధ, నిహితమైయున్నది. ఈరెండింటి తత్వములు గీతాబోధయం దంతర్గతములైయున్నవి.

శ్రీకృష్ణుడు ద్వాపర కలియుగముల సంధికాలమున అవతరించెను. ప్రతికల్పమునందు అట్టి సంధికాలమున భగవానుడు పూర్ణాంశమున అవతరించును. యుగములనాల్గింటిలోను కలియుగ మెంత నికృష్టమైనదో అంత శ్రేష్ఠమైనదికూడ. ఈ యుగము మానవోన్నతికి ప్రధానశత్రువును, పాపప్రవర్తకుడును, నైనకలి యొక్క రాజ్యకాలము. మానవుల పతనమును అధోగతియును, కలియొక్క రాజ్యకాలమున కలుగును. కాని కష్టములతో పోరాడిన. శక్తి వృద్ధియగును. ప్రాతది వినాశనమగుటచే, నవీనము సృష్టియగుచున్నది. కలి యుగమునందే ఈ నియమము చూడనగును. జగత్తు యొక్క క్రమవికాసమునకు అశుభముయొక్క ఏ అంశము వినాశనము కావలెనో, అది కలియుగమున అతి వికాసద్వారమున త్వరితగతిన నష్టపడుచున్నది. మఱి యొకపక్కన కలియుగమున నూతనబీజము నాటబడి, అంకురించి ఆ యంకురము సత్యయుగమున వృక్షముగా పరిణతి పొందగలదు. ఇంతేగాక జ్యోతిషవిద్యయందు ఒకగ్రహముయొక్క దశలో గ్రహములన్నిటి యొక్క అంతర్దశ లెట్లు అనుభవింపబడునో అట్లే కలియొక్క దశలో కృత త్రేతా ద్వాపర కలియుగములు వాని వాని అంతర్దశలు వరుసగా ననుభవింపబడును. ఈవిధ

మున చక్రగతిని, కలియుగమున ఘోరపతనము, తర్వాత ఉన్నతి, తర్వాత ఘోరతరపతనము, అనంతర మున్నతి పొందుటచే భగవానుని ఉద్దేశ్యము నెరవేఱు చుండును. ద్వాపర కలియుగముల సంధికాలమున భగవంతు డవతరించి, చెడుగును పెంపొందచేసి, అశుభ నాశనమును, శుభబీజారోహణయు, అంకురము ప్రకాశించుట కనుకూలావస్థయు, కలుగచేసిన అనంతరము కలియుగము ప్రారంభమాయెను. శ్రీకృష్ణుడు గీతలో సత్యయుగమున కుపకరించు నిగూఢమైన జ్ఞాన కర్మ మార్గముల బోధించెను. కలియుగములో కృతయుగాంతర్దశాగమన కాలమున గీతాధర్మము విశ్వవ్యాపకత తప్పక పొందనవసర మున్నది. ఇందులకు తార్కాణముగా గీతయొక్క ఆదరణ, ఏదోకొంతమంది పండితుల యొక్కయు, జ్ఞానులయొక్కయు, మధ్య మాత్రమే నిబద్ధముగాక, పామరులయందును, పరదేశములయందును విస్తృతి పొందుచున్నది. కనుక వక్తయగు శ్రీకృష్ణునినుండి గీతావాక్యమును విడదీయరాదు. శ్రీకృష్ణుడు గీతలో ప్రచ్ఛన్నుడై యున్నాడు. గీత, శ్రీకృష్ణుని వాఙ్మయమూర్తి.

## పాత్ర

గీతోక్త జ్ఞానముయొక్క పాత్ర పాండవశ్రేష్ఠుడును, ఇంద్రతనయుడు నగు, అర్జునుడు. ఎటులవక్తను త్యజించిన గీతోద్దేశ్యమును దాని గూఢార్థమును

గ్రహించుట కష్టమో, అటులనే పాత్రను విసర్జించిన ఆ అర్థమునకు హాని కలుగును.

అర్జునుడు శ్రీకృష్ణుని సఖుడు. శ్రీకృష్ణునికి సమకాలికులై ఒకే కర్మక్షేత్రమున ఆయనతో బాటుం డినవారు, మానవదేహధారియైన యా పురుషోత్తము నితో తమ పూర్వకర్మానుసారముగా అనేక విధముల సంబంధము కలిగియుండిరి. ఉద్ధవుడు శ్రీకృష్ణుని భక్తుడు; సాత్యకి ఆయన అనుచరుడు; యుధిష్ఠిరుడు ఆయన వాక్యానుసారముగా నడచు ఆత్మీయుడు. అయినను వీరందఱు అర్జునునివలె శ్రీకృష్ణునితో సన్నిహితసంబం ధము నేర్పఱచుకొనజాలకపోయిరి. సమవయస్కుల మైత్రిలోగల మాధుర్యము శ్రీకృష్ణార్జునులలో పూర్తి గాగలదు. అర్జునుడు శ్రీకృష్ణుని మేనమఱదియు, ప్రియసఖుడును. ఇంతియకాదు. ప్రాణసదృశ సోదరియగు శుభద్రకు భర్త; ఇట్టి సన్నిహితత్వము వలననే, అర్జునుని, గీతారహస్య శ్రవణమునకు యోగ్యునిగ నిర్దేశించినట్లు చతుర్థాధ్యాయమున భగవానుడు పలికెను.

"సఏవాయం మయా తేఽద్య యోగః ప్రోక్తః పురాతనః,
భక్తోఽసి మే సఖా చేతి రహస్యం హ్యేతదుత్తమమ్."

పురాతనమైన ఈలుప్తయోగమును, నీవు నాకు భక్తుడవును, సఖుడవును అగుటచే నేను నీకు చెప్పుచున్నా ను. ఏలయన ఈయోగము జగత్తులో శ్రేష్ఠమును పరమ రహస్యమునునై యున్నది. పదునెనిమిదవ అధ్యాయము లో గీతాకేంద్రస్వరూపమగు కర్మయోగ మూలమంత్ర

ము తెలియచెప్పునపుడుకూడను మఱల దానినే పలికెను.

"సర్వగుహ్యతమం భూయః శృణు మే పరమం వచః,
ఇష్టోఽసి మే దృఢమితి తతో వక్ష్యామి తే హితమ్."

"శ్రేష్ఠమైనదియు అతిరహస్యమైనదియు నగు నామాట మరలవినుము. నీవు నాకుమిక్కిలి ప్రియుడవు. ఆకారణముచేతనే నీకు శ్రేష్ఠమార్గమును జెప్పుచున్నాను." ఈశ్లోకముల రెంటితాత్పర్యము శ్రుతి కనుకూలము.

కఠోపనిషత్తులో ఈ విధముగా చెప్పబడెను:-

"నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన,
యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వృణుతే తనూంస్వామ్"

"ఈపరమాత్మ వేదాధ్యయనమువల్లగాని మేధాశక్తివల్లకాని విస్తారశాస్త్రజ్ఞానముచేతకాని పొందబడడు. భగవంతు డెవ్వరిని గ్రహించునో వారికే లభ్యమగును. వారికే ఈపరమాత్మ స్వీయస్వరూపమును ప్రకటించును." కనుక నీశ్వరునితో సఖ్యాదిసంబంధము పొందుట కర్హులైనవారే గీతాజ్ఞానమును పొందుట కర్హులు. తెలిసికొనవలసిన సందర్భము మఱియొకటికూడ నిందులో నిమిడియున్నది. అర్జునుడు తనకు భక్తుడు, సఖుడు, అని భగవంతుడు వచించెను. భక్తులు పలువిధములుగా నుందురు. భక్తుడనినంతనే గురుశిష్యసంబంధమని సాధారణముగా మనస్సులో గలుగును. ఆ భక్తిలో ప్రేమ యుండుట నిజమేయైనను, బాధ్యత, గౌరవము మూఢభక్తి యివి సాధారణముగ దాని

యొక్క విశేషలక్షణములు. కాని సఖుడు సఖుని గౌరవించడు. అతనితో నాటలాడును; హాస్యమాడును. సంతోషపూర్వకముగ సంభాషించును. వేడుకకుగా పరిహాసించును, తిరస్కరించును, తిట్టును, అత్యాచారము చేయును. సఖుడు తన సఖునికి సర్వదా బద్ధుడై యుండడు. అతనిజ్ఞానగరిమ యందును, నిష్కపటహితైషితయందును, ముగ్ధుడై అతని ఉపదేశానుసారమున నడచును. కాని అంధభావముతో నట్లుచేయడు. అతనితో దర్కించును; అతని సమస్త సందేహములను అతని చెంత నుంచుకొనును. మధ్యమధ్య అతనితో ప్రతివాదముచేయును. సఖ్యసంబంధముయొక్క ప్రథమ లక్షణము భయపడకుండుట, ద్వితీయ లక్షణము బాహ్యాడంబరమైన గౌరవము చూపకుండుట.

సఖ్యతయొక్క ఆద్యంతము ప్రేమయే. యెవ్వడీ ప్రపంచమును, మధురముగను, రహస్యమయముగను, ప్రేమాబద్ధముగను, ఆనందక్రీడాసమన్వితముగను తెలిసికొని, భగవంతునిలీలాసహచరునిగ నెన్నుకొని, సఖుడు కాగలడో వాడే గీతాజ్ఞానము పొందుట కర్హుడు. ఎవ్వడు భగవానుని మహిమను, ప్రభుతను, జ్ఞానగరిమను, భీషణతను, హృదయంగముచేసుకొని, అభిభూతుడుకాడో ఆయనతో నిర్భయముగ చిరునగవుతో నాటలాడునో, వాడు గీతాజ్ఞానమును బొందనర్హుడు. సఖ్యసంబంధములో క్రీడయందలిగల సకలసంబంధములు అంతర్భూతములుగా నుండగలవు. సఖ్య

భావము, గురుశిష్య సంబంధమునందు ప్రతిష్ఠితమైనచో అది అత్యంతమాధుర్యమును కూడియుండును. ఇట్టి సంబంధమునే అర్జునుడు గీతాప్రారంభమున శ్రీకృష్ణునితో కలిగించుకొనెను. "నీవు నా పరమహితమును కోరు బంధువు; నిన్నుగాక నేను మరెవ్వానిని శరణుజొత్తును! నేను హతబుద్ధినైతిని; కర్తవ్యభయముచే అభిభూతుడనైయున్నాను. కర్తవ్యసంబంధమున సందిగ్ధస్థితిని బొందితిని. తీవ్రశోకముచే ఆతురతతో గూడియున్నాను. నీవు నన్ను రక్షింపుము. నాకు ఉపదేశము గావింపుము. ఇహపరలోకములయందలి నా సమస్తభారమును నీమీద పడవైచితిని." ఇట్టిభావముతో అర్జునుడు, మానవ సంఘ సఖుడును, ఆశ్రితుడును నగు శ్రీకృష్ణునియొద్ద జ్ఞానమునుపొంద నెంచెను. మాతృసంబంధమైన వాత్సల్యభావముకూడ సఖ్యత్వములో కలదు. వయోజ్యేష్ఠుడును, జ్ఞానశ్రేష్ఠుడును నగు సఖుడు అల్పవిద్యగల సఖుని తనకంటె చిన్నవాడైనను తల్లివలె ప్రేమించును. విపత్తుల నుండి, అశుభములనుండి రక్షించును. ఎవ్వరు శ్రీకృష్ణునితో సఖ్యభావమును స్థాపించుకొందురో, వారికి శ్రీకృష్ణుడు కన్నతల్లివలె కాన్పించును. సఖ్యభావమునం దెట్టిగాఢమైన మాతృప్రేమయొక్క గాంభీర్యత గలదో అట్లే దాంపత్యప్రేమయొక్క తీవ్రతయు ఉత్కంటానందమును గలవు. సఖులొండొరుల సాన్నిధ్యమునందుండుటకు వేడుకొందురు. విరహముచే దుఃఖింతురు. శరీరస్పర్శచే పులకితు లగుదురు. పరస్పరము ప్రాణము

లక్ష్యించుకొనుటలో ఆనందము ననుభవింతురు. దాస్య సంబంధముకూడ సఖులక్రీడయం దంతర్భూతమగుటచే అత్యంత మాధుర్యమును పొందుచున్నది. ఎవ్వ డెంత ప్రేమబంధమును పురుషోత్తముతో స్థాపించకొన గలుగునో వానిస్వభావ మంత అభివృద్ధిచెంది గీతాజ్ఞానము నంతవరకు ప్రాపించుకొనుటకు పాత్రుడగును.

శ్రీకృష్ణునిచెలికాడగు అర్జునుడు మహాభారతములో ప్రధానకర్మి. గీతయందు ప్రధానబోధ కర్మ యోగము. జ్ఞానము, భక్తి, కర్మ మూడును పరస్పర విరోధములుకావు. జ్ఞానప్రవర్తితకర్మయందు భక్తితో కూడిన శక్తిప్రయోగమై, భాగవత-ఉద్దేశ్యపూర్తికిగా భగవానునిచే యుక్తము కావింపబడి, ఆయన ఉద్దేశ్యానుసారము కర్మచేయుట గీతోక్త కర్మమార్గము యొక్క శిక్షణాధారమైయున్నది. ఎవ్వరీ ప్రపంచదుఃఖమునకు భీతిల్లి వైరాగ్యరోగముచే పీడితులై, భగవానుని లీలనుండి ఉదాసీనులై లీలను వదలి, అనంతుని అంకమున దాగుకొనగోరుదురో వారిమార్గము వేఱు. వీర శ్రేష్ఠుడును, మహాధనుర్ధరు డగు, అర్జునునికి అట్టి యిచ్ఛగాని, భావముగాని లేదు. శ్రీకృష్ణుడు, శాంతిగోరు సన్న్యాసి యెదుటగాని, వేదాంతి యెదుటకాని, యీయుత్తమరహస్యమును ప్రకటించలేదు; అహింసా పరాయణుడగు నొకబ్రాహ్మణుని యెదుటగాని ప్రకటించలేదు. కాని మహాపరాక్రమ తేజస్వియగు క్షత్రియ యోధుని, ఈలతులనీయ జ్ఞానప్రాప్తికొరకు ఉపయుక్త

మైన ఆధారముగ గౌరవించెను. ఎవ్వరీప్రపంచపోరా టములో జయాపజయములచే చలింపకుందురో వారే ఈబోధయొక్క గూఢతర స్తరమునందు ప్రవేశింప సమర్థులు. "నాయమాత్మా బలహీనేన లభ్యః" ఈ ఆత్మ బలహీనునిచే లభ్యముకాదు. ముముక్షుత్వము పొందుటకన్న ఈశ్వరునేపొంద నెవడుకోరునో వాడు భగవత్సన్నిధానందముపొంది, తాను నిత్యముక్తస్వభావుడనను యుపలబ్ధిపొంది, ముముక్షుత్వము, అజ్ఞానము యొక్క ఆఖరుదశ యని తలంచి వర్తించగలడు. తామసిక, రాజసికాహంకారములను వీడి సాత్వికాహంకారముచే బద్ధుడైయుండుట కిష్టపడక ఎవడుండునో, వాడు గుణాతీతుడు. అర్జునుడు క్షత్రియధర్మమును పాలించుటకు రాజసవృత్తిని పాలించుటయేకాక, సాత్వికాదర్శమును గ్రహించి, రజశ్శక్తిని సత్వముఖ మొనర్చెను. ఇట్టిపాత్రయే గీతోక్తబోధకు ఉత్తమాధారము.

అర్జునుడు అతని సమకాలిక మహాపురుషులలో శ్రేష్ఠుడు కాడు. ఆ కాలమున ఆధ్యాత్మికజ్ఞానములో వ్యాసుడు శ్రేష్ఠుడు. సర్వవిధ ప్రాపంచకజ్ఞానములో భీష్ముడు శ్రేష్ఠుడు. జ్ఞానతృష్ణలో ధృతరాష్ట్రుడు విదురులు శ్రేష్ఠులు. సాధుసత్వగుణములకు ధర్మతనయుడగు యుధిష్ఠిరుడు శ్రేష్ఠుడు. భక్తియందు అక్రూర ఉద్ధవులు శ్రేష్ఠులు. స్వభావగత శౌర్య పరాక్రమములలో మహారథుడగు కర్ణుడు శ్రేష్ఠుడు. అయ్యును జగత్ప్రభువు అర్జుననే వరించెను.

అతని హస్తమున దిగ్విజయమునొసంగు గాండీవాది దివ్య అస్త్రముల నుంచి, వాని ద్వారమున భరతఖండ మున వేలకొలది జగద్విఖ్యాతవీరులను సంహరింపచేసి, యుధిష్ఠిరునకు అసపత్నసామ్రాజ్యమును వాని పరాక్రముచే దానపూర్వకముగ సంస్థాపనజేసెను. మఱియు కార్యము లన్నింటితోపాటు గీతోక్తపరమజ్ఞానమును పొందుటకతని నొక్కనినే తగినవానినిగా నిర్ణయించెను. మహాభారతమున అర్జునుడు నాయకుడు. ప్రధాన కర్మి. ఆ కావ్యమునందలి ప్రత్యంశము అతని యశోకీర్తిని ఘోషించుచున్నది. ఇందు పురుషోత్తమునిది కాని, మహాభారత కర్తయగు వ్యాసునిదిగాని పక్షపాతము లేదు. అర్జునుని ఈ ఉత్కృష్టత, అతని పూర్ణశ్రద్ధయొక్కయు ఆత్మసమర్పణముయొక్కయు ఫలితమే. ఎవడు పురుషోత్తమునిపై పూర్ణశ్రద్ధగలవాడై ఎట్టికోరికలు లేక స్వీయ శుభాశుభముల పాపపుణ్యముల సమస్త భారము అతనికి సమర్పించి వాని ఆదేశానుసారముగ కర్మచేయుచు, స్వీయప్రవృత్తిని విడిచి, భగవత్ప్రేరితవృత్తిని గ్రహించి భగవదత్తమైన గుణమును, ప్రేరణను, ఆయన కార్యములం దుపయోగించునో అట్టి శ్రద్ధాన్వితుడును, అహంకారరహితుడును, నగు కర్మయోగి పురుషోత్తముని ప్రియసఖుడును, శక్తిసమన్వితుడును అగును. ప్రపంచములో వానిద్వారమున మహాకార్యములు నిర్దోషముగ జరుగును. ఇస్లామ్ ధర్మప్రణేతయగు మహాత్ముడిట్టి యోగశ్రేష్ఠుడే. అర్జునుడు ఇట్టి ఆత్మసమర్పణ

ము చేయుటకు సంసిద్ధుడైయుండెను. ఇందులకు శ్రీకృష్ణుని ప్రేమప్రసన్నతలు కారణములు. ఎవరు సంపూర్ణముగ ఆత్మసమర్పణ చేయుదురో, వారే గీతాజ్ఞానము పొంద నుత్తమాధికారి. శ్రీకృష్ణుడు వారికి గురుప్ర, సఖుడునై వారి యిహపరలోకముల సమస్తభారమును వహించును.

## అవస్థితి

మానవుని ఏ కార్యమునకైనను, లేక మాట యొక్క ఉద్దేశ్యమునకైనను కారణము బూర్తిగా గ్రహింపవలెనన్న ఎట్టి అవస్థయందు ఆమాట, లేక పని జరిగినదో దానిని తెలిసికొనుట ఆవశ్యకము. కురుక్షేత్ర మహాయుద్ధారంభమున శస్త్రప్రయోగము కానున్న సమయమున "ప్రవృత్తే శస్త్రసంపాతే" అను సమయమున భగవానుడు గీతను చెప్పెను. దీనికి కొందఱు క్రోధితులును, విస్మితులును నయ్యెదరు. ఇది కవియొక్క అజాగ్రత్త, లేక బుద్ధిమాంద్యమనెదరు. కాని నిజముగ నిట్టి సమయముననే ఆస్థానమున అవ్విధమైన భావాకులమైనవానికే, దేశకాలపాత్రత లెఱుకపఱచి శ్రీకృష్ణుడు గీతోక్తజ్ఞానమును గఱపెను.

సమయము యుద్ధారంభకాలము. ఎవడు ప్రజల కర్మప్రవాహమున తన వీరత్వబలముల పరీక్షించుకొనడో వాడెప్పుడును గీతాజ్ఞానముపొంద నధికారి కాడు. ఇంతేకాక కఠినమహావ్రతము నారంభించువాని

కనేక విఘ్నములును, శత్రువృద్ధియు, అపజయావకాశ
ము, సాధారణముగనుండును. ఆ మహావ్రత మాచరిం
చుటచే, ఎప్పుడు దివ్యశక్తి కలుగునో, అప్పుడా వ్రత
పూర్తికొఱకు, భగవానుని కార్యసిద్ధికొఱకు, ఈ జ్ఞాన
ము కలుగును; అప్పుడే ఈశ్వరునిపొంద నర్హునిచేసి,
భక్తియుతకర్మతోనే జ్ఞానము కల్గించునని గీత చెప్పు
చున్నది. మఱియు నాతడు దూరముననున్న శాంతి
ప్రదాశ్రమమునకాని, పర్వతమునగాని నిర్జనస్థానమున
గాని ఈశ్వరసాక్షాత్కారమును పొంద నవసరములే
దనియు, కర్మకోలాహలమునందే జగత్తు మూలముననే
స్వర్గీయదీప్తిని పొందుననియు జెప్పుచున్నది. భగవానుని
మధుర తేజోమయవాక్కు వాని కర్ణకుహరమున ప్రవే
శించునని గీత బోధించుచున్నది.

స్థానము యుద్ధక్షేత్రము; ఉభయసేనల మధ్య
భాగమున శస్త్రపాతము జరుగుచుండెను. ఎవడీమార్గా
వలంబకుడో, కర్మాచరణయందు అగ్రేసరుడుగ నుండు
నో, వానికి మహత్తరఫల ముత్పన్నమగుసమయమున,
అకస్మాత్తుగా యోగసంసిద్ధియు జ్ఞానమును తప్పక కలు
గును. ఆ జ్ఞానము కర్మనిరోధకముకాదు; కాని కర్మ
యందు లీనముచేయునది. నిర్జనప్రదేశమున, స్వస్థాత్మ
నికి ధ్యానమువలన జ్ఞానోదయము గల్గుట సత్యమే.
అందుచే మనీషిగణము నిర్జనప్రదేశమున నుండుట
కిచ్ఛగింతురు. కాని గీతోక్తయోగసాధకుడు శరీర ప్రాణ
మనస్సులను, ఆధారమునుండి వేఱుపఱచియుంచి జనుల

మధ్యనుండియు నిర్జనతను, కోలాహలమునం దుండియు శాంతిని, ఘోరకర్మప్రవృత్తియందుండియు నివృత్తిని అనుభవించును. వారు అంతరమును, బాహ్యముచే నియంత్రిత మొనర్చురు. కాని బాహ్యమును అంతరముచే నియంత్రిత మొనర్తురు. సాధారణయోగి సంసారముచే, భయమొందును. సంసారమునుండి భయపడి, యోగాశ్రమమునందు శరణుజొచ్చి యోగమునందు ప్రవృత్తుడగును. సాధారణయోగి బాహ్యమున, శాంతిని, నీరవతను అభిలషించును. శాంతి భంగమయ్యేనని అతనికి తపోభంగ మగును, కాని కర్మయోగి అంతరమున విశాలశాంతిని, నీరవతను భోగించుచుండును. బాహ్యకోలాహలమునందు అతనిలోని ఆవస్థ మరింత గంభీరమగును. బాహ్యమునందలి కలిగిన తపోభంగము, అంతరముననున్న తపస్సున కెట్టిభంగమువాటిల్ల జేయక అతడు అవిచలితుడై యుండును. సమరోద్యుక్త సైన్య మధ్యమున శ్రీకృష్ణార్జునుల సంవాదమెట్లు సంభవించె నని అనేకులు ప్రశ్నింతురు. దానికి సమాధానముయిది. అది యోగప్రభావమున జరిగెను. ఆ యోగబలముచే, ఆయుద్ధకోలాహలము నందుగూడ శ్రీకృష్ణార్జునులకు, అంతరమునను, బాహ్యమునను, శాంతి విరాజిల్లు చుండెను. ఆ యుద్ధకోలాహలము వారి నుభయుల స్పృశింప జాలకుండెను. ఇందు కర్మోపయోగమైన మహత్తెుక ఆధ్యాత్మికబోధ నిహితమైయున్నది. గీతోక్తయోగము ననుశీలన చేయువాడు శ్రేష్ఠమైన కర్మపరుడుమాత్రమే

2

కాక, కర్మనుండి అనాసక్తుడుకూడ. వాడు కర్మల నుండి ఆత్మయొక్క ఆంతరిక ఆవాహనను నాలకించి కర్మనుండి విరతుడై యోగమగ్నుడును తపోరతుడును నగుచు. వాడు కర్మను కర్మఫలమును భగవానునివిగా నెంచి తానొక యంత్రమని తలంచుటచే కర్మఫలము కొఱకు కుత్కంఠితుడుకాడు. కర్మయోగ సువిధికిని, కర్మోన్నతికిని, జ్ఞానవృద్ధికొఱకును, శక్తివృద్ధికిని ఈఆహ్వానము వచ్చినట్లుగా తలచును; కావున కర్మ వీడుటకును భయపడడు; తపస్సుచేయుట ఎప్పటికి వ్యర్థముకాదని తలంచును.

పాత్రయగు అర్జునునికికలిగిన ఈభావము కర్మయోగియొక్క అంతిమసందేహమును మేల్కొలుపుచున్నది. విశ్వసమస్య, సుఖదుఃఖసమస్య, పాపపుణ్యముల సమస్య, అతని నెదుర్కొనును. ఇట్టి సమస్యలచే అనేకులు భయపడి కర్మక్షేత్రమునుండి పలాయనమగుట మంచిదనితలంచి నివృత్తివైరాగ్యకర్మత్యాగములను ప్రశంసించుచు తిరుగుచుందురు. బుద్ధదేవుడు జగత్తును అనిత్యమనియు, దుఃఖమనియు తెలిపి నిర్వాణప్రాప్తిమార్గమును జూపించెను. ఏసుక్రీస్తు టాల్‌స్టాయ మొదలగువారు సంతానవృద్ధికరమగు వివాహపద్ధతికిని, ప్రపంచముయొక్క అనాదనియమమైన యుద్ధమునకు ఘోరమైన విరోధులు. కర్మ అజ్ఞానమువల్ల కలుగుననియు, అజ్ఞానమును వర్జించి, కర్మను వీడి, నిష్క్రియులై శాంతముగ నుండుడని సన్యాసులు

చెప్పెదురు. జగత్తు మిథ్యయనియు, బ్రహ్మమునందు లీనము కమ్మని అద్వైతులు చెప్పెదురు. అటులైన జగత్తు ఎందులకు ఉత్పన్నమయ్యెను? ఈప్రపంచమేల సృష్టింపబడెను? భగవంతుడున్నచో, తెలియని చిన్నపిల్లవాని వలె ఈవ్యర్థపరిశ్రమ ఈనీరస అపహాసమును నేలయారంభించెను. ఆత్మసత్యము, జగత్తుమాయ యైనచో ఆత్మయేల ఈజఘన్య స్వప్నమును తన నిర్మలఅస్తిత్వముపై నారోపించుకొనెను? భగవానుడు లేడని, ఆత్మ లేదని నాస్తికుడు చెప్పుచున్నాడు. అంధశక్తియొక్క యొకఅంధక్రియమాత్రమే కలదని, అదియే కడపటిసత్యమని యెట్లునమ్మనగును? శక్తి ఎవరిది? ఎచటినుండి సృష్టింపబడియె? అదెట్లు అంధోన్మత్తమయ్యెను? ఈ ప్రశ్నల నన్నిటిని సరిగానైనను మీమాంసచేయ లేదు. క్రైస్తవులు, బౌద్ధులు అద్వైతవాదులు, నాస్తికులు, జడవైజ్ఞానికులు ఈ విషయమై యేమియు జెప్పజాలక ఉపేక్షవహింతురు. లేదా యేదోఒక తప్పుదారిని పట్టెదరు. ఉపనిషత్తులు, గీత, యివిరెండే సరియైనసమాధానము నిచ్చును. అందుకనియే కురుక్షేత్ర యుద్ధసమయమున గీతాగానముగావింపబడెను. ఈఘోర సాంసారిక కర్మోద్దేశ్యము గురుహత్య, భ్రాతృహత్యయైయుండెను. ఈ అగణిత ప్రాణసంహారిక యుద్ధప్రారంభము జరుగుచుండెను. అర్జునుడు హతబుద్ధియై గాండీవమును హస్తమునుండి విడిచి గద్గదస్వరమున నిట్లు వచించెను.

"తత్ కిం కర్మణి ఘోరే మాం నియోజయసి కేశవ"

“నన్నేల ఈఘోరకర్మయందు ప్రవేశపెట్టెదవు”

దీనికి సమాధానముగ ఆయుద్ధకోలాహల మధ్యమునుండి వజ్రగంభీరస్వరముతో భగవానుని నోటినుండి మహాగీత వెలువడెను.

‘కురు కర్మైవ తస్మాత్ త్వం పూర్వైః పూర్వతరం కృతం’।
‘యోగస్థః కురు కర్మాణి సంగం త్యక్త్వా ధనంజయ’।
బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే।
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగః కర్మసు కౌశలమ్’॥
‘అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః’।
‘మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మచేతసా।
నిరాశీ ర్నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః’॥
‘గతసంగస్య ముక్తస్య జ్ఞానావస్థితచేతసః।
యజ్ఞాయాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే’॥
‘అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః’
‘భోక్తారం యజ్ఞతపసాం సర్వలోకమహేశ్వరం।
సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాంతి మృచ్ఛతి’॥
‘మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠా।
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్’॥
‘యస్య నాహంకృతో భావో బుద్ధిర్యస్య న లిప్యతే।
హత్వాపి స ఇమాన్ లోకాన్ న హంతి న నిబధ్యతే’॥

“కనుక నీవు కర్మనే చేయవలెను. పూర్వము నుండియు నీపూర్వపురుషులు ఏకర్మ చేయుచుండిరో, ఆ కర్మ నీవును చేయవలెను.

యోగమునందుండి ఆసక్తిని విడనాడి కర్మ చేయుము.

యోగమునందు బుద్ధి నుంచినవాడు పాపపుణ్యముల నతిక్రమించును. కనుక నీవు యోగమునకై యత్నించుము. యోగమన కర్మసాధనయందలి కౌశలమే.

మానవుడు అసక్తభావమున కర్మ యొనర్చిన, నిశ్చయముగా వాడు ఈశ్వరుని పొందును.

జ్ఞానముతో కూడిన హృదయము కలవాడవై, నీసకల కర్మలు నాయందుంచుము. ఆశాహంకారముల త్యజించి, దుఃఖమును విడనాడి యుద్ధమునకు లెమ్ము.

ఎవడు ఆసక్తిరహితుడై ముక్తుడై యుండునో, ఎవనిచిత్తము సదా జ్ఞానపూర్ణమై యుండునో, ఎవడు యజ్ఞార్థము కర్మ ఆచరించునో, వానికర్మలు బంధహేతువులుగాక ఆ క్షణముననే పూర్ణరూపముతో నాయందే లీనమగును.

సమస్త ప్రాణులయందుండెడి జ్ఞానము, అజ్ఞానము ద్వారమున ఆవృతమగును. ఆకారణముచే సుఖదుఃఖములు, పాపపుణ్యములు మొదలగు ద్వంద్వముల సృజించుకొని మోహమున పడును.

నన్ను సర్వలోక మహేశ్వరునిగను, యజ్ఞము, తపస్సు మొదలుగాగల సర్వకర్మలకు భోక్తగను, సర్వభూతములకు సఖునిగను తెలిసికొనిన పరమశాంతి కలుగును.

నేను శత్రువుల నందరిని వధించితిని. నీవు కేవలము యంత్రముగ మాత్రమే వారిని సంహరించుము. దుఃఖించకుము, యుద్ధము చేయుము, యుద్ధమునందు నీశత్రుకోటిని జయించగలవు.

ఎవడు అహంకారరహితుడై యుండునో ఎవని బుద్ధి లిప్తముకాదో వాడు ప్రపంచమునందలి సమస్త జనులను సంహరించినను వధించినవాడు కాడు. వానికి పాపము తగులదు."

ప్రశ్నను తప్పించుకొని మోసగించు లక్షణ మిందేమియు లేదు. ప్రశ్న సువిశదముగా వేయబడెను. భగవంతు డెట్టివాడో జగ త్తెట్టిదో ధర్మమార్గ మెట్టిదో గీతలో సంక్షేపముగా జవాబు చెప్పబడెను. మరియు గీతలో చెప్పబడినది సన్యాసమార్గముగాక కర్మమార్గమై యున్నది. అందుచేతనే గీత అందరికి నుపయోగమైన గ్రంథము.



# గీతాభూమిక
# ద్వితీయకల్పము
## ప్రథమాధ్యాయము

ధృతరాష్ట్ర ఉవాచ:—

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః।
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ॥ ౧

ధృతరాష్ట్రుడు చెప్పుచున్నాడు:—

సంజయా! ధర్మక్షేత్రమగు కురుక్షేత్రమున యుద్ధము జేయగోరి సమావేశమైన నా పుత్రులును, పాండవులును ఏమిచేసిరి?

సంజయ ఉవాచ:—

దృష్ట్వా తు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా,
ఆచార్యముపసంగమ్య రాజా వచనమబ్రవీత్॥ ౨

సంజయుడు చెప్పుచున్నాడు:—

వ్యూహాకారముదాల్చిన పాండవ సైన్యమును గాంచి దుర్యోధనుడు, ద్రోణాచార్యునిచెంత కేగి యిటుల నుడివెను.

పశ్యైతాంపాండుపుత్రాణా మాచార్యమహతీం చమూమ్,।
వ్యూఢాం ద్రుపదపుత్రేణ తవ శిష్యేణ ధీమతా.॥ ౩

ఆచార్యా! ద్రుపదకుమారుడును, తమ శిష్యుడును, బుద్ధిమంతుడును నగు ధృష్టద్యుమ్నునిచే వ్యూహబద్ధమైన పాండవుల యీ గొప్పసేనను చూడుడు.

అత్ర శూరా మహేష్వాసా భీమార్జునసమా యుధి,।
యుయుధానో విరాటశ్చ, ద్రుపదశ్చ మహారథః.॥ ౪

ఈ సేనలో శూరులును, ధనుర్ధరులును, సంగరమున భీమార్జునులతో సమానులగు సాత్యకి, విరాటుడు, మహారథుడగు ద్రుపదుడును,

ధృష్టకేతు శ్చేకితానః కాశీరాజశ్చ వీర్యవాన్,।
పురుజి త్కుంతిభోజశ్చ శైబ్యశ్చ నరపుంగవః.॥ ౫

ధృష్టకేతువు, చేకితానుడు, వీర్యవంతుడగు కాశీరాజును, పురుజిత్తు, కుంతిభోజుడును, నరపుంగవుడగు శైబ్యుడును,

యుధామన్యుశ్చ విక్రాంత ఉత్తమౌజాశ్చ వీర్యవాన్,।
సౌభద్రో ద్రౌపదేయాశ్చ సర్వ ఏవ మహారథాః.॥ ౬

పరాక్రమసంపన్నుడగు యుధామన్యుడు, బలాఢ్యుడగు నుత్తమౌజుడును, అభిమన్యుడును, ద్రౌపదీపుత్రులును మున్నగు నీ మహారథులెల్లరు గలరు.

అస్మాకం తు విశిష్టా యే తాన్నిబోధ ద్విజోత్తమ,।
నాయకా మమ సైన్యస్య సంజ్ఞార్థం తాన్ బ్రవీమి తే.॥ ౭

బ్రాహ్మణోత్తమా! మన సేనలో నాయకులును, ఘనులునగువారల దెలియబలుకుచున్నాను వినుడు.

భవాన్ భీష్మశ్చ కర్ణశ్చ సమితింజయః,।
అశ్వత్థామా వికర్ణశ్చ సౌమదత్తి స్తథైవచ.॥ ౮

మీరును, భీష్ముడు, కర్ణుడు, యుద్ధమున జయము నొందు కృపాచార్యుడు, అశ్వత్థామ, వికర్ణుడు, భూరిశ్రవుడు, జయద్రథుడును.

అన్యే చ బహవశ్శూరా మదర్థే త్యక్తజీవితాః,।
నానాశస్త్ర ప్రహరణా స్సర్వే యుద్ధవిశారదాః.॥ ౯

మఱియు నానిమిత్తము ప్రాణముల నర్పించగల శూరులింక ననేకులు గలరు. వారందరు యుద్ధవిశారదులును, నానావిధశస్త్రసంపన్నులును.

అపర్యాప్తం తదస్మాకం బలం భీష్మాభిరక్షితమ్,।
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్.॥ ౧౦

భీష్మునిచే సురక్షితమైన మన సైన్య మపారము. భీమునిచే సంరక్షితమగువారి బల మల్పసంఖ్యగలది.

అయనేషు చ సర్వేషు యథాభాగ మవస్థితాః,।
భీష్మ మేవాభిరక్షంతు భవంతస్సర్వ ఏవహి.॥ ౧౧

కావున మీ రెల్లరు నిర్దేశింపబడిన స్థానముల యథోచితముగ నిలిచి, భీష్మాచార్యుని సంరక్షించవలయును.

తస్య సంజనయన్ హర్షం కురువృద్ధః పితామహః,॥
సింహనాదం వినద్యోచ్చైశ్శంఖం దధ్మౌ ప్రతాపవాన్.॥

ఈవిధమున నుడువుచున్న దుర్యోధనునకు హర్షోద్రేకము కల్గించుచు, కురువృద్ధుడును, ప్రతాపవంతుడును, పితామహుడును నగు భీష్ముడు గొప్పసింహనాదమొనరించి శంఖమును బూరించెను.

తతశ్శంఖాశ్చ భేర్యశ్చ పణవానక గోముఖాః,।
సహసైవాభ్యహన్యంత స శబ్దస్తుములోఽభవత్.॥ ౧౩

అనంతరము, శంఖములు, భేరులు, పణవములు, ఆనకములు, గోముఖములు మున్నగు రణవాద్యముల నొక్కసారి మ్రోయించిరి. ఆ ధ్వని సంకులమై అంతటను వ్యాపించెను.

తతశ్శ్వేతైర్హయైర్యుక్తే మహతి స్యందనే స్థితౌ,।
మాధవః పాండవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః.॥ ౧౪

పిమ్మట శ్వేతాశ్వములచే బూన్చబడిన గొప్ప రథమందు గూర్చుండియున్న కృష్ణార్జునులు దివ్యములగు శంఖముల బూరించిరి.

పాంచజన్యం హృషీకేశో దేవదత్తం ధనంజయః,।
పౌండ్రం దధ్మౌ మహాశంఖం భీమకర్మా వృకోదరః.॥ ౧౫

శ్రీకృష్ణుడు పాంచజన్యమును, అర్జునుడు దేవదత్తమును భయంకరవ్యాపారయుతుడగు భీముడు పౌండ్రమను మహాశంఖమును బూరించిరి.

అనంతవిజయం రాజా కుంతీపుత్రో యుధిష్ఠిరః,।
నకులస్సహదేవశ్చ సుఘోషమణిపుష్పకౌ.॥ ౧౬

కుంతీపుత్రుడగు ధర్మరాజు అనంతవిజయమును, నకులుడు సుఘోషమును,సహదేవుడు మణిపుష్పకమను శంఖములను బూరించిరి.

కాశ్యశ్చ పరమేష్వాసః శిఖండీ చ మహారథః,।
ధృష్టద్యుమ్నో విరాటశ్చ సాత్యకిశ్చాపరాజితః.॥ ౧౭
ద్రుపదో ద్రౌపదేయాశ్చ సర్వశః పృథివీపతే,।
సౌభద్రశ్చ మహాబాహుశ్శంఖాన్దధ్ముః పృథక్పృథక్.॥

మహాధనుర్ధరుడగు కాశీరాజు, మహారథుడగు శిఖండి, ధృష్టద్యుమ్నుడు, విరటుడు, అపజయము నెరుంగని సాత్యకి, ద్రుపదుడు, ద్రౌపదీపుత్రులు, మహాబాహుండగు అభిమన్యుడు మున్నగు నందరును వేఱువేఱు శంఖములను బూరించిరి.

సఘోషో ధార్తరాష్ట్రాణాం హృదయాని వ్యదారయత్.।
నభశ్చ పృథివీం చైవ తుములో వ్యనునాదయన్.॥ ౧౯

ఆ మహాధ్వని భూమ్యాకాశముల బ్రతిధ్వనింపజేయుచు దుర్యోధనాదుల హృదయముల వ్రయ్యజేసెను.

అథ వ్యవస్థితాన్ దృష్ట్వా ధార్తరాష్ట్రాన్ కపిధ్వజః,।
ప్రవృత్తే శస్త్రసంపాతే ధనురుద్యమ్య పాండవః.॥ ౨౦
హృషీకేశం తదా వాక్యమిదమాహ మహీపతే.।

పిదప శస్త్రయుద్ధము ప్రారంభింపగా యుద్ధసన్నద్ధులై నిలచిన దుర్యోధనాదుల జూచి, కపిధ్వజుడగు

అర్జునుడు ధనుస్సు నెక్కుపెట్టి శ్రీకృష్ణునితో నిట్లనియె.

> సేనయో రుభయోర్మధ్యే రథం స్థాపయ మేఽచ్యుత॥ ౨౧
> యావదేతాన్ నిరీక్షేఽహం యోద్ధుకామానవస్థితాన్।
> కైర్మయా సహ యోద్ధవ్య మస్మిన్ రణసముద్యమే॥ ౨౨

అచ్యుతా! ఈ సంగ్రామమున నే నెవరితో బోరవలయునో, ఈ యుద్ధసన్నద్ధులై నిలిచియున్నవారల బాగుగా గాంచుదనుక, నా రథమును రెండుసేనలమధ్యను నిలుపుము.

> యోత్స్యమానానవేక్షేఽహం య ఏతేఽత్ర సమాగతాః।
> ధార్తరాష్ట్రస్య దుర్బుద్ధే ర్యుద్ధే ప్రియచికీర్షవః॥ ౨౩

దుష్టబుద్ధియగు దుర్యోధనునకు యుద్ధమున హితమొనరింపగోరి వచ్చి, యుద్ధము సేయనున్నవారిని నన్ను జూడనిమ్ము.

సంజయ ఉవాచ:—

> ఏవముక్తో హృషీకేశో గుడాకేశేన భారత।
> సేనయోరుభయోర్మధ్యే స్థాపయిత్వా రథోత్తమమ్॥ ౨౪
> భీష్మద్రోణప్రముఖతః సర్వేషాం చ మహీక్షితామ్।
> ఉవాచ పార్థ పశ్యైతాన్ కురూనితి॥ ౨౫

సంజయుడు చెప్పుచున్నాడు:-

అర్జును డీ విధమున నుడివినపిదప, శ్రీకృష్ణుడు సకలరాజులయు భీష్మద్రోణులయు నెదుట ఉభయసేనల మధ్యభాగమున రథమునుంచి ఇట్లు చెప్పెను. "అర్జునా, కూడియున్న కౌరవుల జూడుము"

తత్రాపశ్యత్ స్థితాన్ పార్థః పితౄనథ పితామహాన్,।
ఆచార్యాన్మాతులాన్ భ్రాతౄన్ పుత్రాన్ పౌత్రాన్సఖీం
స్తథా॥ ౨౬
శ్వశురాన్ సుహృదశ్చైవ సేనయో రుభయోరపి.।

అపుడు అర్జును డుభయసేనలందుంగల తండ్రులను తాతలను గురువులను మేనమామలను సోదరులను పుత్రులను పౌత్రులను స్నేహితులను మామలను సుహృదయులను గాంచెను.

తాన్ సమీక్ష్య స కౌంతేయస్సర్వాన్ బంధూనవస్థితాన్,॥
కృపయా పరయాఽఽవిష్ట విషీదన్నిదమబ్రవీత్.। ౨౭

ఈవిధమున సకల బంధువులు యుద్ధసన్నద్ధులై యుండ జూచి అర్జునుడు తీవ్రకృపావిష్టుడై దుఃఖించుచు ఇట్లు పలికెను.

అర్జున ఉవాచ:—

దృష్ట్వేమం స్వజనం కృష్ణ యుయుత్సుం సముపస్థితమ్,॥
సీదంతి మమ గాత్రాణి ముఖం చ పరిశుష్యతి.।
వేపథుశ్చ శరీరే మే రోమహర్షశ్చ జాయతే॥ ౨౯
గాండీవం స్రంసతే హస్తాత్ త్వక్చైవ పరిదహ్యతే.।

అర్జునుడు చెప్పుచున్నాడు:-

కృష్ణా! ఈస్వజనులందరు యుద్ధమొనర్ప సమావేశమగుట జూచి నా దేహమందలి ప్రతి అవయవము శిథిలమగుచున్నది. నోరెండుచున్నది. శరీరము కంపమొందుచు గగుర్పాటు గలుగుచున్నది. గాండీవము

చేతినుండి జారిపోవుచున్నది. చర్మము దహించుకొని పోవుచున్నది.

న చ శక్నోమ్యవస్థాతుం భ్రమతీవ చ మే మనః॥ 30
నిమిత్తాని చ పశ్యామి విపరీతాని కేశవ.।

నిలుచుండుటకు శక్తి చాలకున్నది. మనస్సు చలించుచున్నది. అపశకునములు కానవగుచున్నవి.

న చ శ్రేయోఽనుపశ్యామి హత్వా స్వజనమాహవే॥ 31
న కాంక్షే విజయం కృష్ణ న చ రాజ్యం సుఖాని చ.।

కేశవా! యుద్ధమున స్వజనమును వధించి శ్రేయమును గాంచజాలను. నాకు విజయ మక్కర లేదు. రాజ్యము వలదు. సుఖము వలదు.

కిం నో రాజ్యేన గోవింద కిం భోగైర్జీవితేన వా॥ 32
యేషామర్థే కాంక్షితంనోరాజ్యంభోగాస్సుఖానిచ.।
త ఇమేఽవస్థితా యుద్ధే ప్రాణాంస్త్యక్త్వా ధనాని చ॥ 33
ఆచార్యాః పితరః పుత్రా స్తథైవ చ పితామహాః.।

గోవిందా! రాజ్యమేల? భోగములేటికి? జీవించియున్నందుకు ప్రయోజనమేమి? ఎవ్వారికొఱకు రాజ్యమును భోగములను, సౌఖ్యములను గోరుచుంటినో వారందరు ప్రాణములను త్యజించి ఈయుద్ధక్షేత్రమున కదు దెంచిరి. వారెవరన ఆచార్యులు, తండ్రులు, కుమారులు, తాతలు,

మాతులాః శ్వశురాః పౌత్రాః శ్యాలాస్సంబంధినస్తథా॥ 34
ఏతాన్న హంతుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన.।

అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిం ను మహీకృతే,॥ 35
నిహత్య ధార్తరాష్ట్రాన్నః కా ప్రీతిస్స్యాజ్జనార్దన.।

మేనమామలు, మామలు, మనుమలు, బావమరదులు, బంధువులు; మధుసూదనా! వారు నన్ను సంహరించినను, మూడులోకముల రాజ్యము నాకు రానున్నను, నేను వారిని జంపదలచుకొనలేదు. ధార్తరాష్ట్రులను సంహరించిన నాకేమిసంతోషము కలుగును?

పాపమేవాశ్రయే దస్మాన్ హత్వైతా నాతతాయినః,॥ 36
తస్మాన్నార్హావయంహంతుంధార్తరాష్ట్రాన్స్వబాంధవాన్।
స్వజనం హి కథం హత్వా సుఖినస్స్యామ మాధవ.॥ 37

వీరు దుష్టులైనను వీరిని వధించుటచే పాపమే వచ్చును. కనుక బంధువులతో గూడియున్న దుర్యోధనాదులను వధింపరాదు. గోవిందా! స్వజనులను వధించుటచే ఎటుల సుఖముకలుగును?

యద్యప్యేతే న పశ్యంతి లోభోపహతచేతసః,।
కులక్షయకృతం దోషం మిత్రద్రోహే చ పాతకమ్.॥ 38

దుర్యోధనాదులు లోభముచే మతిలేనివారై కులక్షయమువలన కలుగుదోషమును, మిత్రద్రోహముచే గలుగుపాతకమును గ్రహింపజాలరు.

కథం న జ్ఞేయమస్మాభిః పాపాదస్మాన్నివర్తితుమ్,।
కులక్షయకృతం దోషం ప్రపశ్యద్భిర్జనార్దనా.॥ 39

ఓ జనార్దనా! కులక్షయముచే గలుగు కీడును

గ్రహించిన మన మిట్టిపాపమునుండి మరలుట కేల ప్రయత్నించరాదు?

కులక్షయే ప్రణశ్యంతి కులధర్మాస్సనాతనాః।
ధర్మే నష్టే కులం కృత్స్న మధర్మోభిభవత్యుత॥ ౪౦

కులక్షయముచే సనాతనములగు కులధర్మములు నశించును. ధర్మము నశించుటచే అధర్మము కులమంతటను వ్యాపించును.

అధర్మాభిభవాత్కృష్ణ ప్రదుష్యంతి కులస్త్రియః।
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసంకరః॥ ౪౧

కృష్ణా! అధర్మ మభివృద్ధియగుటచే కులస్త్రీలు చెడుదురు. స్త్రీలు చెడుటచే వర్ణసంకరము ఏర్పడును.

సంకరో నరకాయైవ కులఘ్నానాం కులస్య చ।
పతంతి పితరో హ్యేషాం లుప్తపిండోదకక్రియాః॥ ౪౨

వర్ణసంకరముపొందిన కులమునకును, కులనాశకులకును నరకప్రాప్తి కలుగును. అందుచే వారి పితృదేవతలు, పిండములు, ఉదకక్రియలు లేనివారగుటచే అధోలోకమున పడుదురు.

దోషైరేతైః కులఘ్నానాం వర్ణసంకరకారకైః।
ఉత్సాద్యంతే జాతిధర్మాః కులధర్మాశ్చ శాశ్వతాః॥ ౪౩

వర్ణసంకరకారకులగు కులఘాతకుల దోషముచే, సనాదిగ వచ్చుచున్న జాతిధర్మములు, కులధర్మములు నశించును.

ఉత్సన్నకులధర్మాణాం మనుష్యాణాం జనార్దనా,।
నరకే నియతం వాసో భవతీత్యనుశుశ్రుమః॥ ౪౪

కులధర్మములు నశించిన, మనుష్యులు తప్పక నరకమున బడుదురని వినుచున్నారము.

అహో బత మహత్పాపం కర్తుం వ్యవసితా వయమ్,।
యద్రాజ్యసుఖలోభేన హంతుం స్వజనముద్యతాః॥ ౪౫

అయ్యో! యెంతవిచారకరము! మనము మహాపాపముచేయ కృతనిశ్చయుల మైనారము. అదేదన రాజ్యసుఖలోభముచే స్వజనులను సంహరించుటకు సంసిద్ధుల మైతిమి.

యది మామప్రతీకారమశస్త్రం శస్త్రపాణయః।
ధార్తరాష్ట్రా రణే హన్యుస్తన్మే క్షేమతరం భవేత్. ౪౬

ఆయుధధారులగు దుర్యోధనాదులు, శస్త్రమును బట్టక ప్రతిక్రియ చేయని నన్ను యుద్ధమున సంహరించినను నాకది శ్రేయస్కరమే యగును.

సంజయ ఉవాచ:—

ఏవముక్త్వార్జునస్సంఖ్యే రథోపస్థ ఉపావిశత్,।
విసృజ్య సశరం చాపం శోకసంవిగ్న మానసః॥ ౪౭

సంజయుడు చెప్పుచున్నాడు:—

అర్జును డీవిధమున నుడివి, దుఃఖముచే వ్యాకులచిత్తుడై బాణములతో గూడిన వింటిని విడిచి యుద్ధభూమియందు రథముమీద గూర్చుండెను.

## సంజయుని దివ్యదృష్టి

మహాభారతమునందలి మహాయుద్ధారంభకాలమున గీత జెప్పబడియున్నది. అందుచే గీతలోని ప్రథమ శ్లోకముచే ధృతరాష్ట్రుడు దివ్యచక్షుప్రాప్తుడగు సంజయుని యుద్ధవార్త అడిగెను. యుద్ధరంగమునకువచ్చిన ఉభయసేనలు క్రిందమమున నేమిచేసెనో ఆ వృద్ధరాజు తెలిసికొనకోరెను. ఆంగ్లేయభాష నభ్యసించిన ఆధునిక భారతీయ విద్యావంతులదృష్టిలో సంజయుని దివ్యదృష్టి కవికల్పనతప్ప వేఱేదియుకాదు కాని ఎవ్వరైన దూరదృష్టిని (Clairvoyance) దూరశ్రవణమును (clair audience) పొంది దూరముననున్న యుద్ధరంగమునందు రోమాంచకారదృశ్యమును, మహారథులయొక్క సింహనాదమును నిందిృయగోచరము చేసికొనిరనిన వారికంత అవిశ్వాసము కలుగదు. కాని వ్యాసుడీశక్తిని సంజయునికిచ్చెనని మనము చెప్పిన, అది కవులకల్పనయని త్రోసివేయుదురు. ఒకానొక విఖ్యాత ఐరోపాశాస్త్రజ్ఞుడు అముకవ్యక్తి కొకనికి మోహనిద్రావస్థకలిగించి వానినోటినుండి దూరపు సంగతిని తెలిసికొనెనని చెప్పిన పాశ్చాత్యమోహనిద్ర (Hypnotism) యనెడి విద్య నెరిగినవారు ఈసంగతి మనస్సుయొక్క ధ్యానశక్తిచేత తెలిసికొనెనని విశ్వసింతురు. కాని ఈ హిప్నోటిజమ్ అనునది యోగశక్తియందలి నికృష్టము త్యాజ్యము నగు నొక అంగము మాత్రమే. మానవులలోనున్న నిట్టి అనేకశక్తులను పూర్వకాలపు సభ్యజాతులు తెలిసికొనియుండిరి; వానిని

వికసింపచేసికొనియుండిరి. ఇప్పుడు కలిసంభూత-అజ్ఞాన ప్రవాహమునందు నివి యన్నియు కొట్టుకొనిపోయినవి. స్వల్పాంశమేదో కొలదిమందియందు రహస్యవిద్యగా రక్షితమైయున్నది. సూక్ష్మదృష్టియనగా సూక్ష్మేంద్రియ ద్వారమున స్థూలేంద్రియాతీత పదార్థమును జ్ఞానమును పొందగలశక్తి. దీనివలన మనము సూక్ష్మవస్తువుల జూడ గలము. సూక్ష్మవాసనను గ్రహించగలము. సూక్ష్మ పదార్థముల తాకగలము. సూక్ష్మాహారమును ఆస్వా దించగలము. సూక్ష్మసృష్టియొక్క చరమపరిణామమునే దివ్యదృష్టి యని చెప్పుదురు. వీని ప్రభావమున దూర మున నున్నట్టియు రహస్యమైనట్టియు, అన్యలోకగత మైనట్టియు, నగు సంగతులు మనకు జ్ఞానగోచర మగు ను. వ్యాసమహర్షి తనయోగశక్తి మహాప్రభావమున దివ్యదృష్టిని సంజయుని కియ్యగలిగియుండెను. దీనిని నమ్మకుండుట కెట్టి కారణము లేదు. పాశ్చాత్య హిప్నో టిస్టు (Hypnotist) యొక్క అద్భుతశక్తిని మనము నమ్మి నచో, అనుపజ్ఞానియగు వ్యాసునిశక్తియందు అవిశ్వాస మేలకు? శక్తిమంతులు తమశక్తిని నితరుల శరీరమందు సంచరింపజేయగలరు. ఇందుల కనేక ప్రమాణములు చరిత్రలోని ప్రతి పుటయందును మానవజీవితముయొక్క ప్రతి కార్యమునను కానవచ్చును. నెపోలియన్ మొద లగు కర్మవీరులు తాము యోగ్యులని తలంచిన మను ష్యులకు శక్తిని ప్రవేశింపచేసి వారిద్వారమున తమ కార్యముల నిర్వర్తింపచేసికొనిరి. అతిసాధారణయోగి

కూడా నేదోయొకసిద్ధినిబొంది ఇతరులకు తనశక్తి నీయఁగల డు. మఱి వ్యాసదేవుఁడో జగచ్ఛ్రేష్ఠమనీషి, అసామాన్య యోగసిద్ధపురుషుడు; అందుచే నాయన దివ్యచక్షువుల నొసంగుట కపోలకల్పనగాదు. అదియొక వైజ్ఞానిక సత్యము. కన్నులు చూడఁజాలవనియు, చెవులు వినజాల వనియు, నాశిక ఆఘ్రాణించజాలదనియు, శరీరము స్పర్శించజాలదనియు, జిహ్వ రుచిచూడ జాలదనియు, మనస్సే చూచుననియు, వినుననియు, ఆఘ్రాణించు ననియు, స్పర్శించుననియు, ఆస్వాదించుననియు మన మెఱుఁగుదుము. దర్శనశాస్త్రమందు, మనోవిజ్ఞాన శాస్త్రమందు నీసత్యము చాలకాలమునుండి నమ్మఁబడు చున్నది. మోహనిద్ర కూడ మన వైజ్ఞానికశాస్త్రముచే పరీక్షింపబడి, కండ్లు మూసికొనినను దర్శనేంద్రియము చేయుపని నేనాడిద్వారమున నైనను పొందవచ్చునని ఋజువుచేయబడినది. చక్షురాది స్థూలేంద్రియములు జ్ఞానప్రాప్తికొఱకు కేవల సువిధాజనక-ఉపాయములై యుండుకారణముగను, స్థూలశరీరపు అనాది అభ్యాసముచే నాయింద్రియములకు మనము బద్ధులైయుం డుకారణముగను, వానికి దాసులమైతిమి. కనుక వాస్త వమునందు యేదేని వస్తువుయొక్క జ్ఞానమును శరీరము యొక్క యే ప్రణాళిద్వారమునకూడ మనస్సునకంద జేయవచ్చును. ఏలన, అంధుఁడు వస్తుస్పర్శచే దానిరూప మును స్వభావమును సరిగా ధారణచేయఁగలడు. కాని స్వప్నావస్థపొందినవానిదృష్టికిని అంధునిదృష్టికిని భేదము

గలదు. మొదటివాడు మనోమధ్యను వస్తువుయొక్క ఆకృతినిజూచును. దీనినే దర్శనమందురు. వాస్తవమేమన మనము మన యెదుటనున్నవస్తువును చూచుట లేదు; కాని ఆవస్తువుయొక్క ఆకారము మన కండ్లలో చిత్రింపబడును. దానినిచూచి ఆవస్తువునుచూచినట్లు మనస్సుచెప్పును. కాని స్వస్థావస్థప్రాప్తి వ్యక్తి దూరమునన్న వస్తువునుచూచుటకాని శబ్దమునువినుటకాని జరిగినపుడు, అట్టులగ్రహించుటకు, నెట్టి శారీరకప్రణాలి కావశ్యకత లేదనియు, సూక్ష్మదృష్టిద్వారమున చూడనగుననియు ఋజువగుచున్నది. ఒకమనుష్యుడు లండను నగరమున స్వగృహములో కూర్చుండి ఎడింబరులో నాసమయమున జరుగుచున్న కార్యమును మనస్సులో చూచితినని చెప్పుచుండు దృష్టాంతములు దిన దినము చూచుచున్నాముకదా? దీనినే సూక్ష్మదృష్టియందుము. సూక్ష్మదృష్టికిని దివ్యదృష్టికిని భేదమిది. సూక్ష్మదర్శి కాన్పించనివస్తువులయొక్క ప్రతిమూర్తిని, మనస్సులో చూచును. దివ్యదర్శి మనోమధ్యను జూడక శారీరక స్థూలచక్షువులతో నెదుటనే చూడగలడు. చింతనాస్రోత మందు శబ్దమును వినుటగాక, శారీరకకర్ణముల ద్వారముననే వినును; దీనికొక దృష్టాంతముగలదు; స్ఫటికపు టద్దము (crystal) లో, లేక మనముప్రాసికొను మసి యందు సమసామయికఘటనలను తెలిసికొనుట. కాని దివ్యదృష్టిప్రాప్తించినయోగి కివ్విధమైన యుపకరణముల కావశ్యకత లేదు. అతడీశక్తిద్వారమున నుపకరణ రహి

తముగనే దేశకాలబంధములను క్రొంచుకొని ఇతర దేశ ముల సంగతులుగాని యితరకాలపు విషయములుగాని, గ్రహించగలడు. దేశబంధ విమోచనప్రమాణమును మనము చూచుచున్నాము, కాలబంధవిమోచనప్రమా ణము నింకను చూడలేదు; కాని యిదియు సాధ్యమే. మానవుడు త్రికాలదర్శి కాగలడు. దేశబంధవిమోచనము సంభవమైయుండ, కాలబంధ విమోచనము అసంభవ మనజాలము. ఏది ఎటులున్నను వ్యాసప్రదత్త దివ్యచక్షు వులద్వారమున సంజయుడు హస్తినాపురముననుండియే కురుక్షేత్రముననున్న పాండవ ధార్తరాష్ట్రులను కండ్ల తోచూచి దుర్యోధనుని మాటలను భీష్మపితామహుని సింహనాదమును పాంచజన్యముయొక్క కురుధ్వంస ఘోషకమైన మహాశబ్దమును గీతార్థద్యోతకమైన శ్రీ కృష్ణార్జునులసంవాదమును చెవులతో వినెను. మహాభార తము రూపకముకాదనియు, శ్రీకృష్ణార్జునులు కవికల్పి తులుగారనియు, గీత ఆధునిక తార్కికులయొక్కగాని, లేక దార్శనికులయొక్కగాని సిద్ధాంతముగాదనియు, మాయభి ప్రాయము. కనుక గీతలోని ఏ విషయమూ, అసంభవము గాని యుక్తివిరుద్ధముగాని కాదని యిట్లు ఋజువగుచున్న ది. అందుచేతనే దివ్యచక్షుప్రాప్తి విషయమై యింత దీర్ఘముగా విచారింపబడెను.

## దుర్యోధనుని వాక్కౌశలము

యుద్ధమునందలి ప్రాథమికకార్య వర్ణనచేయుటకు సంజయు డారంభించెను. దుర్యోధనుడు పాండవ సేన

యొక్క వ్యూహరచనముజూచి ద్రోణాచార్యుని సమీపించెను. ద్రోణునియొద్ద కెందుకువెళ్లెనో వ్యాఖ్యానించు టావశ్యకము. భీష్ముడు సేనాధిపతిగాన యుద్ధసంగతులాయనకు చెప్పుట ఉచితము. కాని కపటబుద్ధిగల దుర్యోధనునికి భీష్మాచార్యునిపై విశ్వాసములేదు. భీష్మునికి పాండవులపై ప్రీతియు అనురక్తియు గలవు; అతడు హస్తినాపురమునసున్న శాంత్యానుమోదక దళమునకు నేత. పాండవులకును, ధార్తరాష్ట్రులకును మాత్రమే యుద్ధముజరిగిన, అతడెన్నడును అస్త్రధారణ చేసెడివాడుకాడు కాని, కౌరవజాతికి ప్రాచీనశత్రువును, ప్రతిస్పర్ధియు సామ్రాజ్యాభిలాషియునగు పాంచాలజాతి ద్వారమున కురురాజ్యము ముట్టడింపబడుటజూచి, కౌరవ జాతియొక్క ప్రధానపురుషుడు యోధుడు, రాజనీతిజ్ఞుడు సేనాధిపతిగా చేయబడి స్వీయ బాహుబలముచే చిరకాలమునుండి రక్షింపబడుచున్న స్వజాతిగౌరవ ప్రాముఖ్యములను కడపటిసారిగా రక్షింప సంకల్పించెను. దుర్యోధనుడు అసూయాస్వభావము గలవాడు. రాగద్వేషములే అతని కార్యములన్నిటికిని ప్రమాణములు, కారణములు; కనుక కర్తవ్యపరాయణుడగు నా మహాపురుషుని యొక్క మనోభావమును అతడు గ్రహించజాలడు. స్వీయకర్తవ్యము నెరవేర్చుటకై తనకు ప్రాణసమానులైన పాండవులసహితము యుద్ధక్షేత్రమున సంహరింపగల బలము ఈకఠినతపస్వికి కలదనుసంగతి అతడెన్నడును విశ్వసింపజాలకపోయెను. స్వదేశహితైషి, తనజాతి

అన్యాయమున అహితమున బడనున్నతజీని, ఆలోచన సమయమునందు, అహితమునుండి కాపాడుటకు తనశక్తి కొలది ప్రయత్నించియు, తుదకు తన స్వాభిప్రాయమును ఉపేక్షించి అధర్మయుద్ధమునగూడ స్వజాతిని రక్షించుటకును శత్రువులను శిక్షించుటకును సన్నాహించును. భీష్ముడిట్టిమార్గమునే అవలంబించెను. దుర్యోధనునికిది అర్థముకాని విషయము. కనుక భీష్మునియెడ్డకపోక ద్రోణుని స్మరించెను. ద్రోణుడు వ్యక్తిగతముగ పాంచాలరాజునకు ఘోరశత్రువు. పాంచాలదేశ రాజకుమారుడు ధృష్టద్యుమ్నుడు గురువగు ద్రోణునివధించుటకు ప్రతిజ్ఞచేసెను. అందుచే నీవ్యక్తిగత వైరభావమును జ్ఞాపకమొనర్చిన, ఆచార్యుడు శాంతిపక్షమునువీడి పూర్ణోత్సాహముతో యుద్ధమొనర్చునని తలంచెను. కాని దుర్యోధనుడు స్పష్టముగా నీసంగతిచెప్పక ధృష్టద్యుమ్నుని పేరుమాత్రము పేర్కొనెను. అనంతరము భీష్ముని సంతోషపెట్టతలంచి ఆయనను కురురాజ్య రక్షకుడనియు, ఆయనయే విజయమున కాధారభూతుడనియు, బల్కెను. మొదలు శత్రుపక్షములోని ముఖ్యయోధుల పేర్లను బేర్కొని అనంతరము తన సైన్యములోని ముఖ్యుల పేర్లన్నింటిని చెప్పక కొందరివి మాత్రమే చెప్పెను. ఇందులకు కారణమేమన భీష్మద్రోణుల నామముల పేర్కొనుటయే అతని అభిప్రాయము కాని, ఆ అభిప్రాయమును మఱుగుపఱచుటకుగాను మరినాలైదు పేర్లు వచించెను, అనంతరము దుర్యోధనుడు "నాసైన్య

ము చాలయెక్కువగా నున్నది. భీష్ముడు సేనాధిపతి. పాండవులసైన్యము మిక్కిలిస్వల్పము. వారి ఆశాస్థల మంతయు భీముని భుజములపై నున్నది. అందుచే మన మేల జయింపజాలము? అయినను జయమున కాధారుడగు భీష్ముని, శత్రువుల ఆక్రమణమునుండి రక్షించుట మన కుచితము. ఆయనయున్న మన విజయము అవశ్యంభావిగ నుండును.'' అని పల్కెను. అనేకులు ''అపర్యాప్త''మను పదమునకు విపరీతార్థమును చెప్పెదరు. అది యుక్తిసంగతము కాదు. ఏలయన దుర్యోధనుని సేనలోని నాయకులు శౌర్యధైర్యములలో నెవ్వరికిని తీసిపోవువారు కారు. అట్టిచో ఆత్మశ్లాఘియగు దుర్యోధనుడు తనయొక్క బలమును నిందించుకొని ఏల నిరాశ పొందును? భీష్ముడు దుర్యోధనుని భావమును అతని మాటలయొక్క రహస్యోద్దేశ్యమును గ్రహించి అతని సందేహమును పోగొట్టదలంచి సింహనాదముచేసి శంఖమును పూరించెను. దీనిచే దుర్యోధనునిహృదయము ప్రసన్నత నొందెను. తన ఉద్దేశ్యము నెరవేరినదనియు భీష్మద్రోణులు సందేహమువీడి యుద్ధమొనర్తురనియు నతడు తలంచెను.

## పూర్వసూచన

భీష్మునిగగనభేది శంఖనాదముచే యుద్ధరంగము కంపితమయ్యెను. అప్పుడు కౌరవసైన్యము సర్వదిశల నుండి యుద్ధవాద్యములను మోగించెను. రథగణ మంతయు రణోల్లాసముచే ఉన్మత్తులైరి. రెండవవైపున

పాండవశ్రేష్ఠుడును, అతని సారథియగు శ్రీకృష్ణుడును, భీష్ముని యుద్ధాహ్వానమునకు బదులుగా శంఖనాదమొన ర్చిరి. అట్లే యుధిష్ఠిరాది పాండవపక్షవీరులును, తమ తమ శంఖముల నూది సైన్యహృదయములోని రణచం డిని జాగృతి కావించిరి. ఈ మహాశబ్దము పృథ్వని, గగనమండలమును, ప్రతిధ్వనింపచేసి ధార్తరాష్ట్రుల హృదయముల విదీర్ణమొనర్చెను. అర్జునుటచే భీష్ముడు మొదలగువారు శబ్దముచే భయపడిరనికాదు, వీరు వీర పురుషులు; రణచండియొక్క ఆహ్వానమునకు వారేల భీతిల్లెదరు? కవి మొట్టమొదటనే అత్యంత ఉత్కట శబ్దశరీరముచేగలుగు ప్రభావమును వర్ణించియున్నాడు. ఎవ్విధమున పిడుగుశబ్దపుధ్వని అనేకుల దద్దరిల్లచేయునో అటులనే యుద్ధరంగమంతటను నీశబ్దము వ్యాపించెను. అంతేగాక యీ శబ్దము ధార్తరాష్ట్రుల భావిసంహార ఘోషణాయనునట్లు పాండవుల అస్త్రములచే విదీర్ణ ముగానున్న వారిహృదయములు ముదుగనే యీశబ్ద ముచే పగిలెను. యుద్ధమారంభమయ్యెను. రెండువైపుల నుండి శస్త్రప్రయోగము జరుగసాగెను. ఆసమయమున అర్జునుడు శ్రీకృష్ణునితో నిట్లు చెప్పెను. "దుర్బుద్ధి పరుడగు దుర్యోధనునికి ప్రియకార్యము నొనర్చుటకు ఎవరెక్కడ సమాగతమయ్యిరో ఎవరితో నేనుయుద్ధము చేయవలెనో వారిని చూచుటకు నారథమును ఉభయ సైన్యములకు మధ్యకుపోనిమ్ము" ఇట్లుచెప్పుటలో అర్జు నుని భావమిది. "పాండవులకుగల యీశ. యంతయు నా

పైననేయున్నది. నాచేతనే శత్రువర్గములోని ప్రధాన యోధులందరు చంపబడవలెను. కనుక వారెవరో నేను చూడవలసియున్నది.” ఇంతవఱకు అర్జునునికి సంపూర్ణ క్షత్రియస్వభావము గలదు. కృపగాని, దౌర్బల్య సూచకమైన చిహ్నమేదికాని కనబడలేదు. భరతఖండ ములోని అనేక శ్రేష్ఠ వీరపురుషులు రెండవపక్షమునం దుండిరి. వారినందఱనీ సంహరించి తన అన్నయగు ధర్మ రాజుకు నిష్కంటకసామ్రాజ్యమును నియ్య నుద్యుక్తు డై యుండెను. కాని అర్జునునికి హృదయదౌర్బల్యము కలదనియు, నిపుడది నివారణకానిచో నెలనెలవేడో ఒకప్పుడది ఆకస్మికముగా చిత్తమునుండి బుద్ధిలో ప్రవే శించి పాండవులకు కష్టమునేగాక వారికి నాశనము కూర్చు నని శ్రీకృష్ణుడు ఎఱుగును. అందుచేతనే అర్జునునికి ప్రియులైన భీష్మద్రోణులు మొదలైనవారిని, కౌరవ సైన్యములోని సకల రాజన్యులను చూడగలుగునట్టి స్థానమున రథమునుంచి “కూడియున్న కురుజాతిని చూ డు”మనెను. ఇక్కడ మనము జ్ఞప్తికి దెచ్చుకొనవలసిన విషయము, అర్జునుడుకూడ కురుజాతీయుడే యనియు, కురువంశ గౌరవము అతనిగౌరవమనియు తన ఆత్మీయ ప్రియజనులు బాల్యసఖులు అందరు కురుజాతివారే యనియు, అందుచే శ్రీకృష్ణుడు తననోటినుండి ఈమూ డు ముఖ్యశబ్దములను గంభీరఅర్థభావముతో సహజముగా అతనికి తోచునట్లు పలికెను. అప్పుడర్జునుని కెవ్వరిని సంహరించి, యుధిష్ఠిరునికి అసపత్న సామ్రాజ్య మియ్య

దలంచెనో వారందరు స్వీయబంధువులును గురువులును స్నేహితులును తప్ప మఱెవ్వరు కాదని తోచెను. భరతఖండములోని యేకక్షత్రియులెల్లరు ప్రియసంబంధము ద్వారా, పరస్పర మాబద్ధులైయుండిరో, వారందఱును పరస్పరము వధించుకొనుట కొఱకే రణరంగమున సమావేశమైయుండుట అతడు చూచెను.

విషాదమునకు మూలకారణము

అర్జునుని విషాదమునకు మూలకారణమేది? అనేకులు, ఈవిషాదమును ప్రశంశించుచు శ్రీకృష్ణుడు కుమార్గదర్శకుడనియు, అధర్మాచు మోదకుడనియు జెప్పి నిందింతురు. క్రైస్తవమతములోని శాంతభావము, బౌద్ధ ధర్మములోని అహింసాభావము వైష్ణవమతములోని ప్రేమభావము, శ్రేష్ఠములనియు, యుద్ధము నరహత్యా పాపమనియు, భ్రాతృహత్య గురుహత్యలు మహాపాప మనియు తలచి, వారట్టిభావములకు వశవర్తులై యిట్టి అసంగతమును బల్కుదురు. ఈ ఆధునిక భావములన్నియు, ద్వాపర యుగముననున్న మహావీరులైన పాండవుల మనస్సులందు కలుగలేదు. అహింస, యుద్ధము, వీనిలో నేది శ్రేష్ఠమైనదను సంశయముగాని, నరహత్య, భ్రాతృహత్య గురుహత్య మహాపాపములనికాని, అందుచే యుద్ధమునుచూని ఈపాపములను చేయకుండుట యుచితమనికాని, ఇట్టిభావ విచారచిహ్నములేవియు, అర్జునుని మాటయందు లేవు. కాని గురుజనుల వధించుటకంటె

భిక్షాన్నమే శ్రేయస్కరమనియు, బంధువులను వధించుటచే పాపము మనల పొందుననియు చెప్పెననుట సత్యమే. అయిన అర్జును డిట్లు చెప్పినది, కర్మస్వభావమును జూచిగాక, కర్మయొక్క ఫలితమును తలపోసిమాత్రమే. ఈకారణముచేతనే శ్రీకృష్ణుడు అతని విషాదమును పోగొట్టదలచి, కర్మయొక్క ఫలితమును చూడకూడదనియు, కర్మస్వభావమునుచూచి, అదిచేయు టుచితమా లేదా, యని నిశ్చయము చేసికొనవలసినదనియు బోధించెను. అర్జునుని ప్రథమభావము, వారందఱు ఆత్మీయులు గురుజనులు బంధువులు బాల్యసఖులు అనియు, అందఱును భక్తిప్రేమ స్నేహపాత్రులనియు, వారిని వధించుటచే నిష్కంటకరాజ్యము ప్రాప్తించినను, రాజ్యభోగ మెప్పటికికూడ సుఖప్రదమైనదికా దనియు, అంతేగాక రాజ్యభోగముచే దుఃఖమునుపొంది, జీవితపర్యంతము పశ్చాత్తాపమువలన దగ్ధముకావలసియుండుననియు, బంధు-బాంధవ-శూన్యైశ్వర్యరాజ్య మెవ్వరికికూడ కోరదగినది కాదనియునై యుండెను. అర్జునుని ద్వితీయభావము ప్రియజనులహత్య ధర్మవిరుద్ధమనియు, ద్వేషపాత్రులనుమాత్రమే యుద్ధమునందు వధించుట క్షత్రియధర్మమనియునై యుండెను. అతని తృతీయభావము, స్వార్థముకొఱకట్టి కర్మయొనర్చుట ధర్మవిరుద్ధమనియు క్షత్రియులకు తగినది కాదనియునై యుండెను. అతని చతుర్థభావము, భ్రాతృవిరోధహత్యలచే, కులనాశము, జాతినష్టము కలుగుననియు, నిట్టి ఫలమును

కలుగజేయుట, కులరక్షకుడు జాతిరక్షకుడునగు క్షత్రియు నకు మహాపాపమనుట స్పష్టమైయుండెను. ఈనాల్గుభావములు తప్ప అర్జునునికి విషాదకారణములేవియు నుండలేదు. ఈవిషయమును మనము గ్రహించకపోయిన, శ్రీకృష్ణుని యుద్దేశ్యమును గాని, బోధయొక్క అర్థమును గాని మన ము తెలిసికొనజాలము. క్రైస్తవధర్మము, బౌద్ధధర్మము వైష్ణవధర్మములతో, గీతాధర్మము యొక్క విరోధ సామంజస్యతలను తరువాత తెలుపబడును. అర్జునుని వాక్యముయొక్క భావమును గుఱించి, సూక్ష్మవిచారము చే తెలిసికొందము.

## వైష్ణవమాయాప్రవేశము

అర్జునుడు మొదట తన విషాదమునుగూర్చి చెప్పె ను. పిమ్మటకృప లాకస్మికముగ నర్జునునిపై విక్రోహ మొనరించి, అతనిని పరాస్తుని అభిభూతుని గావించుట చే క్షణకాలములో నతని శరీరబలమంతయు క్షీణింప, అవయవము లన్నియు దుర్బలముకాగ, నడచుటకును శక్తిలేక, హస్తమునందు గాండీవమును ధరించకూడ శక్తి లేనివాడై శోకోత్తాపముచే జ్వరలక్షణములు పొడ చూప, త్వచము అగ్నియందువలె మండుచుండ, ముఖ ము వాడిపోవ, శరీరమంతయు కంపించెను. ఈభావ వర్ణనగూర్చి చదివినప్పుడు, మొదట యిది కల్పనయను నట్టియభిప్రాయము కలుగును; కాని వీనినిగుఱించి సూక్ష్మముగా విచారింతుమేని వీనియందలి గూఢార్థ మొకటి మనకు తెలియును. ఇంతకుపూర్వ మర్జునుడు

కౌరవులతో ననేకసార్లు యుద్ధముచేసియుండెను; అప్పు
డిట్టి భావము లతనియం దుదయించలేదు; ఈ సమయ
మున శ్రీకృష్ణుని సంకల్పశక్తిచే అర్జునునియందు హఠా
త్తుగా ని ఆంతరికభావన లుత్పన్నమయ్యెను. మానవ
జాతియొక్క అనేక అత్యంతప్రబలవృత్తులు, అర్జునుని
యందు క్షాత్రియశిక్షచే, ఉచ్చాకాంక్షచే జయింపబడియు
ఆబద్ధమై అతని హృదయతలమందు గుప్తరూపమున
దాగియుండెను. నిగ్రహముచే చిత్తశుద్ధి కలుగజాలదు;
విశుద్ధ వివేకబుద్ధిసహాయముచే, సంయమముచే చిత్త
శుద్ధి కలుగును. నిగృహీత వృత్తులు, భావములు, ఈ
జన్మమునందో లేక జన్మాంతరమునందో, చిత్తమునందు
అంకురించి బుద్ధిని ఆక్రమించి, అక్కడ విజయముగాంచి,
మానవుని సమస్త కర్మలను తమ వికాసమున కనుకూల
ము గావించుకొనును. ఈ కారణముచే. ఈజన్మమునందు
దయావంతుడగువాడు,* మఱిజన్మమునందు నిష్ఠుర

* ఈ వాక్యములను చదువుపాఠకులు, దీనిని తప్పు అర్థము
చేసికొనకుండ దీనిని విశదీకరించవలసియున్నది. వ్యక్తి మృతి
చెందినపుడు, వ్యక్తిగత భౌతికశరీరము పంచభూతములలో కలిసి
పోవునట్లుగనే, వ్యక్తిగత ప్రాణికగుణములు, కృప, సచ్చరిత్రము
అనునట్టివి, అవి యెంతవఱకు విశ్వగత మొనరించబడలేదో, అవి
ప్రాణికలోకమునందు విలీనమగును. పునర్జన్మమెత్తినపుడు. ఆ గుణ
ము లతనిని వెంబడించవు. ఈగుణములు విశ్వగత మొనరించ బడి
ననే, పునర్జన్మయందు, అవి అతనిని వెంబడించును. అందుచే,
మరణించిన వ్యక్తి, మఱియొకజన్మయందు నూతనానుభవములు
కలిగించుటకొఱకు, నూతనస్వభావముతో కూడిన పరిస్థితులయందు,
అతడు జన్మనొందును.

స్వభావు డగుచున్నాడు; ఈజన్మమునందు కామియు దుశ్చరిత్రుడు నగువాడు తర్వాతి జన్మమునందు సాధువు సచ్చరిత్రుడు నగుచున్నాడు. అందుచే, వానిని నిగ్రహించుటకుబదులు, వివేక విశుద్ధబుద్ధిసహాయముచే సర్వ వృత్తులను తొలగించి, చిత్తమును శుద్ధిగావించుకొనవలెను. ఇట్లు చేయుటనే సంయమమందురు. జ్ఞానప్రభావముచే తమోభావమును దూరముగావించలేనంత వఱకు, సంయమము పనిచేయజాలదు. అందుచే శ్రీకృష్ణుడు అర్జునుని అజ్ఞానమును దూరముచేసి, అతనియందు నిద్రించుచున్న వివేకమును మేల్కొలిపి, అతని చిత్తమును శుద్ధముకావింప తలంచెను. కాని త్యాజ్యవృత్తులు చిత్తమునందు మేల్కొని బుద్ధియెదుట ఉపస్థితము కావంతవఱకు బుద్ధి వానిని తొలగించవలసిన యవసరముండదు. అప్పుడుమాత్రమే అంతస్థిత దైత్యరాక్షసుల నుండి, వివేకబుద్ధిని యుద్ధముద్వారా ముక్తిగావించ పిలుపడును. యోగసాధనా ప్రారంభావస్థయందు, చిత్తమునందుండు కుప్రవృత్తులు సాధకుని భయశోకములచే విహ్వలము గావించును; వీనిని పాశ్చాత్యులు సైతానుని కార్యమని చెప్పుదురు; దీనినే మారుని, లేక కామదేవుని ఆక్రమణయనియు మనము చెప్పుదుము. కాని యీభయశోకములు అజ్ఞానముచే కలుగును; ఇవి సైతానునిచే కలుగుటలేదు; ఇవి భగవానుని శక్తిమునుండియే వచ్చుచున్నవి. అంతర్యామియగు జగద్గురువు, ఈ ప్రవృత్తులను చెఱుపుకొనుటకుగాక, మేలుకొలుకే ఆహ్వా

నించి అతని చిత్తమును శుద్ధముగావించును. శ్రీకృష్ణు డీప్రకారము, బాహ్యజగత్తునందు అర్జునునికి సశరీర సఖుడును సారధియునై యుండిన విధముననే ఆంతరమున అశరీర యీశ్వరుడుగను అంతర్యామి పురుషోత్తముడు గను విరాజిల్లుచు ఆయనయే, ఈగుప్తభావనలను వృత్తులను అర్జునునిపై ఒక్కసారిగా విసరెను. వీని భీషణాఘాతముచే మానసిక వికారమును, స్థూలశరీరమునందు కవి వర్ణించిన లక్షణములును చూపట్టెను. ఇట్టి అప్రత్యాశిత శోకమోహములచే శరీరమున కీ విధమగు వికారములు కలుగునని మనకు తెలియును. ఇది మానవునికి సాధారణానుభవమే. భగవానుని వైష్ణవమాయ, పూర్తిగా నొక్కక్షణములో అర్జును నోడించెను. దీని వలననే అతనియందీ వికార ముత్పన్నమయ్యెను. ఎప్పుడధర్మము, దయ, ప్రేమాదిధర్మముల కోమలాకారమును ధరించియు, అజ్ఞానము జ్ఞానముయొక్క ఛద్మవేషము ధరించియు, ప్రగాఢ అంధకారమయ తమోగుణము ఉజ్వల-విశద-పవిత్రతయొక్క మిథ్యారూపమును ధరించియు, "నేను సాత్వికుడను, నేను జ్ఞానిని, నేను ధర్మాత్ముడను, భగవంతుని ప్రియదూతను, పుణ్యరూపుడను పుణ్యప్రవర్తకుడను"అని చెప్పునో, అప్పుడు భగవానుని వైష్ణవమాయ బుద్ధియందు ప్రవేశించియుండును.

### వైష్ణవమాయా లక్షణములు

ఈ వైష్ణవమాయయొక్క ముఖ్యాస్త్రములు కృపాస్నేహములు. మానవజాతియొక్క ప్రేమస్నేహ

వృత్తులు విశుద్ధములుకావు. శారీరక ప్రాణికవికారముల వల్ల, పవిత్రిదమూవేృమలు కలుషితము వికలాంగము నగును. వృత్తులకు వాసస్థానము చిత్తము; భోగము లకు క్షేత్రము ప్రాణము; కర్మలకుయంత్రము శరీరము: చింతనాప్రదేశము బుద్ధి. ఇవియన్నియు విశుద్ధమైనప్పు డు, అవి స్వాతంత్ర్యముగలవై, పరస్పర – అవిరోధము లగును. చిత్తమునందు భావముదయించును. తదను సారముగ శరీరమునందు కర్మ జరుగును. బుద్ధియందు తత్సంబంధవిచారము కలుగును. అదేభావ కర్మచింత నల యానందమును ప్రాణము భోగించును; జీవుడు సాక్షి భూతుడై ప్రకృతియొక్క యీయానందమయి క్రీడలను వీక్షించి, ఆనందించును. అశుద్ధావస్థయందు, శారీరక లేక మానసికభోగమునకు ప్రాణము లాలయితమై, శరీ రము కర్మయంత్రముగాగాక భోగసాధనముగా నేర్పడి, శరీరభోగములయం దాసక్తిగలదై, వానిని వాంఛించు చుండును; చిత్తము శారీరక భోగవాసనచే ఆక్రంతమై నిర్మలభావమును గ్రహించ నసమర్థమగును; కలుషిత వాసనాయుక్తభావములు చిత్తసాగరమును విక్షోభ మొనరించును. వాసనల కోలాహలము బుద్ధిని అభిభూత మొనరించి వ్యాకులపఱచును; అప్పుడు బుద్ధి నిర్మలా భ్రాంత శాంత చింతనలను గ్రహించ శక్తిలేకపోవును; చంచల మనస్సుకు బుద్ధి వశీభూతమై, అసత్యప్రాబల్యము చే విచారవిప్లవము భ్రాంతియు నేర్పడి అంధతను పొందును. ఈబుద్ధిభ్రంశచే, జీవుడుకూడ జ్ఞానశూన్యు

_నైసాక్షిభావమును నిర్మలానందభావమును కోల్పోయి, ఆధారముతో నేకమై, "నేను దేహమును, నేను ప్రాణమును, నేను చిత్తమును, నేను బుద్ధిని" అను మొదలగు భ్రాంతులయందుబడి, శారీరక మానసిక సుఖదుఃఖములచే వీనిని అనుభవించుచుండును. ఈ ఉత్పాతమునకు మూలము అశుద్ధబుద్ధియే; కనుక ఉన్నతికి ప్రథమ సోపానము చిత్తశుద్ధియే. ఈ అశుద్ధి కేవల తామసిక రాజసవృత్తులను కలుషిత మొనరించుటతో నూరకోనక సాత్వికవృత్తినికూడ కలుషిత మొనరించును. "ఒకానొకవ్యక్తి నాశారీరిక మానసికభోగములకు సామగ్రి; నాకది సంతోషమును కలిగించును; నాకతడే కావలయును; అతడులేనిది నాకు క్లేశము కలుగుచున్నది," అనుట అశుద్ధప్రేమను సూచించును; శరీరప్రాణములు చిత్తమును కలుషితమొనరించి, నిర్మలప్రేమను వికృత మొనరించును. బుద్ధియు నీ అశుద్ధిచే భ్రాంతినొంది, యిట్లు చెప్పును; "ఒకానొకస్త్రీ నాకు చెందినది; ఒకానొకడు నా సోదరుడు, లేక నాసోదరి, నాసఖుడు, ఆత్మీయుడు, మిత్రుడు, వాని నేప్రేమించవలెను; ఆప్రేమయే పుణ్యమయము; అట్టిప్రేమకు విరుద్ధముగా చేయుటయే పాపము క్రూరము అధర్మము." ఈ ప్రకారమశుద్ధప్రేమఫలస్వరూపముచే బలయుతమగు కృపయేర్పడి, ప్రియజనులకు కష్టము కలుగజేయుటకన్నను అయిష్టమును కలిగించుటకన్నను, ధర్మమునకు తిలాంజలినిచ్చుట శ్రేయస్కరమని తలంచి, అంత్యమున

ధర్మమును అధర్మమని, తన కృపకు భంగముగాకుండ, దౌర్బల్యముచే తన్నుదా సమర్థించుకొనును. ఈ విధముగ వైష్ణవమాయయొక్క పరిమాణములు అర్జునుని ప్రతిపదమునందును కనబడును.

అర్జునుడు పలికిన మొదటి పలుకులివి,— "వీరు నా స్వజనులు, ఆత్మీయులు, స్నేహపాత్రులు; యుద్ధమునందు వీరిని హత్యగావించుటచే నాకెట్లు హితము కలుగును? విజేతకు గలగర్వము, రాజునకుగల గౌరవము, ధనికునికిగల సౌఖ్యము, ప్రాప్తించును. సారహీనమగు నీయన్నింటి స్వార్థమును నేను గోరను. రాజ్యము, భోగము, జీవితమందు ప్రజలకేల ప్రియము నొసంగుచున్నవి? సొంత యిల్లాలు, కొడుకు, కూతురు లనియు, ఆత్మీయ స్వజనులనియు, వారిసుఖముచే, తనకు సుఖము కలదనియు, బంధుబాంధవులయొద్ద ఐశ్వర్యసుఖము ననుభవింతుననియు, ఆనందముగా వారితో కాలముగడుపుదుననియు లోకులు తలంచుచుందురు. ఈ కారణముచే సుఖమాహాత్మ్యములు, కోరవలసిన విషయములే యగుచున్నవి. కాని నే నెవ్వరికొఱకు, రాజ్యమును భోగమును సుఖమును కోరుచున్నానో, వారే శత్రువులై యుద్ధముకొఱ కుపస్థితులైయున్నారు. వారునన్ను వధింప సిద్ధపడియున్నారు. వారు నాతోకూడి రాజ్యమును సుఖమును అనుభవించుట కయిష్టులు. కాని వారునన్ను చంపిననుసరే, వారినిమాత్రము నేను చంపనొల్లను. వారిహత్యచే ముల్లోకములరాజ్యము నాకు చేకూరినను

వారిని నేనుచంపను. అట్టినాకు పృథ్వియొక్క అసపత్న సామ్రాజ్యపదవి యొకలెక్కలోనిదా!

"నకాంక్షే విజయం కృష్ణ, నచరాజ్యం సుఖానిచ"
ఏతాన్నహన్తు మిచ్ఛామి, ఘ్నతోఽపి మధుసూదనా
అపి త్రైలోక్యరాజ్యస్య హేతోః కిన్నుమహీకృతే."

ఈ శ్లోకములలోని మాటలతో స్థూలదర్శులు మోహితులై యిట్లు పలుకుదురు, "ఆహా, అర్జునునిభావ మెంతగొప్పది, యెంత ఉదారమైనది, ఎంత ప్రేమమయమైనది; రక్తముతోకూడిన భోగసుఖములకన్న పరాజయము మరణము చిరకాలదుఃఖము మేలనెను." కాని మనము అర్జునుని మనోభావములను పరీక్షించితిమేని మనకు తెలియునదేమన, అర్జునుని భావములు కడు క్షుద్రములనియు దుర్బలతా సూచకములనియు, కాతరతాపూర్ణములనియు తెలియనగును. కులహితమునుగోరి, ప్రియజనులప్రేమకు లోనై, కృపకు వశీభూతుడై, రక్తపాత భయముచే వ్యక్తిగతస్వార్థమును త్యాగము చేయుట అనార్యులకు ఉదారభావము గావచ్చు. కాని ఆర్యులభావమునది మధ్యమకోటియం దున్నవారికి చెందినది; భగవత్ప్రీతికొఱకు స్వార్థమునుత్యజించి, ధర్మము నెరవేర్చుట ఉత్తమభావము. మఱిరెండవపక్షమున కులహితముకొఱకు, ప్రజలప్రేమకొఱకు, కృపకు పరవశుడై రక్తపాతభయముచే ధర్మమును విడుచుట అధమభావము. భగత్ప్రీతికొఱకు, ధర్మముకొఱకు స్నేహకృపాభయములను లేకుండ జేసికొనుట యథార్థఆర్యభావము.

తన క్షుద్రభావమును సమర్థించుకొనుటకు అర్జునుడు స్వజనులహత్య పాపమని యిటులచెప్పెను, "కౌరవులవధచే మాకెట్లు మనస్తుష్టి కాగలదు? వీరు మాబంధుబాంధవులు, ఆత్మీయస్వజనులు; వీరు అన్యాయమునుచేయుచు మమ్ము ద్వేషించుచు మారాజ్యమును దొంగిలించ గోరుచున్నారు; అయ్యును వీరిని వధించుటచే నాకు పాపమే కలుగును, సుఖము కలుగదు." ఇట్లంతయు చెప్పుచుండెడి అర్జునుడు తాము ధర్మయుద్ధమునకు దిగితిమని మఱచెను. తనయొక్కగాని, లేక యుధిష్ఠురునియొక్కగాని సుఖము కొఱకు, కౌరవవధకార్యమునందు శ్రీకృష్ణుడు అతనిని నియమించియుండలేదు; కాని ధర్మస్థాపనకొఱకు అధర్మనాశనముకొఱకు, క్షత్రియ ధర్మపాలనకొఱకు, భారతఖండమందు ధర్మముతోకూడిన నొకమహా సామ్రాజ్యమును స్థాపించుట యుద్ధముయొక్క ఉద్దేశ్యమైయుండెను. సమస్త సుఖములకు తిలాంజలి అర్పించి జీవితపర్యంతము దుఃఖమును, నియమనమును సహించుచు, ఈ ఉద్దేశ్యమును సిద్ధింపజేసికొనుట అర్జునుని కర్తవ్యము.

## కుల నాశన విషయము

అర్జునుడు తన దుర్బలతను సమర్థించుకొనుటకై, ఒక యున్నతోపాయమును ప్రకటించెను; యుద్ధమునందు జాతి కులములు నాశమగుననియు, అందుచే నాయుద్ధము ధర్మమగునదిగాక, అధర్మమగునది యనెను. భ్రాతృహత్యచే మిత్రద్రోహము జరుగుననియు, అనగా, నెవ్వరు

స్వాభావముచే అనుకూలురుగను సహాయులుగను నుందురో, వారికి అనిష్టములగుననియు, అట్లే కులమను టచే కౌరవులను పేరుగల క్షత్రియవంశీకులు అనియు వారు రెండు పక్షములందును నున్నారనియు, వారు వినాశన మగుదురనియు నర్జునుడు తలంచెను. ప్రాచీన కాలమందు జాతులు ప్రాయికముగ రక్తసంబంధము గలవిగనుండెను. ఒక్కకులము, లేక వంశము పెరిగి పెరిగి పెద్దదగుటచే, జాతిగా పరిణమించుచుండెను; భోజవంశము కురువంశము మొదలగునవి, భారతజాతి యందు మొదలు అంతర్గత కులవిశేషములుగ నుండి, తర్వాతకాలమున, నివి బలశాలి జాతులుగ నేర్పడెను. కులములో ఒకరియందొకరికేర్పడు విరోధము, అందుచే అనిష్టమును కలిగించుకొనెడి ప్రవృత్తియు, మిత్రద్రోహముగా నర్జునుడు భావించెను. నైతికదృష్టి ననుసరించి యీమిత్రద్రోహము మహాపాతకమనియు, ఆర్థిక నీతి దృష్టిచేకూడ మిత్రద్రోహమునందు మహాదోషమొకటి కలదని అతడు తలంచెను. ఈ మిత్రద్రోహముయొక్క ఫలము అవశ్యంభావిగా కులక్షయమే యగును. సనాతన కులధర్మముయొక్క విశిష్టవిధానముచే కులముయొక్క యున్నతస్థితి యేర్పడుచున్నది; వీని మహాదాదర్శములచే, కర్మబద్ధమగు గార్హస్థ్యజీవితమును, రాజనీతియనెడి క్షేత్రమునందు పితృపురుష సంబంధస్థాపితత్వమును నేర్పడినవి; అట్టిచో, ఈఆదర్శములకు హానికలుగుటచే ఈనియమము లన్నియు శిథిలమై, కులము అథఃపతనము

చెందును. కుల మెంతవఱకు సౌభాగ్యవంతముగ బలశాలిగ నుండునో అంతవఱకు ఆదర్శములును కర్మనియమములును సురక్షితముగనుండును; కాని కులము క్షీణించి దుర్బలమైనప్పుడు తమోభావ మధికమై ధర్మములు శిథిలమగును; వీని ఫలస్వరూపములుగ, అరాజకత దుర్నీతి మొదలగు దోషములు కులమునందు ప్రవేశించి, కులస్త్రీలు దుశ్చారిత్రలై, కుల పవిత్రత నష్టమై, నీచచారిత్రకులయొక్కయు, నీచజాతియొక్కయు సహవాసముచే మహాకులమునందు వర్ణసంకర మేర్పడును. ఈవిధముగ పితరుల నిజసంతతి లేకపోవుటచే కులనాశకులకు నరకప్రాప్తి కలుగును; అధర్మ మధికమగుటచే వర్ణసంకర సంభూత నైతిక-అధోగతి యేర్పడును; నీచగుణములు వృద్ధియగుటచే, అరాజకత మొదలగు దోషములు ప్రవేశించి సమస్తకులమునకు వినాశనము ప్రాప్తించి, పృథ్వి నరకప్రాప్తయోగ్యమగును. కులము నశించుటచే కులధర్మము జాతిధర్మము నష్టముపొందును. ఇక్కడ జాతిధర్మమనుటచే, సమస్తకుల సమష్టులచే నేర్పడిన జాతియు, దాని పరస్పరాగత సనాతన - ఆదర్శములు నియమములు. దీనితర్వాత అర్జును డొక్కసారి తన ప్రథమసిద్ధాంతమును, కర్తవ్యాకర్మవిషయక నిశ్చయమును తెల్పియజేసి, యుద్ధసమయమున గాండీవమును విడిచి రథముపై కూలబడెను. శోకముచే అతనిబుద్ధి విప్లవ మొందుటచే, ఈప్రకారముగా క్షత్రియునికి అనుచితమును, మఱియు ఆర్యునికి అనుచితమునైన

ఆచరణమునకు సంకల్పించెనని ఈ అధ్యాయమునందలి అంతిమశ్లోకమునందు కవి వివరించెను.

విద్య, అవిద్య

అర్జునుని కులనాశవిషయక మాటయందు మన మొక అత్యంతవిశాల-ఉన్నతభావముయొక్క ఛాయను చూడగలము. ఈభావములోకూడిన జటిల ప్రశ్నను ఆలోచించుట గీతావ్యాఖ్యానమున కత్యంతావశ్యకము. కాని గీతయందు మనము కేవల మాధ్యాత్మికార్థమును వెతికి, మనజాతీయ గార్హస్థ్య వ్యక్తిగత సాంసారిక కర్మలను, ఆదర్శములను, గీతోక్తధర్మమునుండి పూర్ణముగా వేఱుపఱచినచో, దాని భావమున్ను ఆప్రశ్నయొక్క ప్రయోజనీయతయు నష్టపడి గీతోక్తధర్మముయొక్క సర్వవ్యాపకవిస్తారము సంకుచితమగును. శంకరాది మొదలగు గీతావ్యాఖ్యాతలు, సంసారత్యాగులు, దార్శనిక-ఆధ్యాత్మ విద్యాపరాయణులగు జ్ఞానులు లేక భక్తులునైయుండిరి; వారు గీతయందు తమ కావశ్యకమగు జ్ఞానభావములను వెతికి, వానిని పొంది సంతుష్టులైయుండిరి. కాని ఒక్కసారి జ్ఞానియు కర్మియు భక్తుడునై యుండువాడే గీతయొక్క గూఢతమబోధ కర్తాడు. గీతకు వక్తయగు శ్రీకృష్ణుడు జ్ఞానియు కర్మియునైయుండెను, గీతాబోధను పొందుటకు పాత్రుడగు నర్జునుడు భక్తుడును కర్మియునైయుండెను; ఇతనికి జ్ఞానదృష్టి కలిగించుటకు కురుక్షేత్రమునందు శ్రీకృష్ణుడీ బోధను ఘోషించెను; ఒక మహా రాజనీతిసంఘర్షణ,

గీతాబోధకు కారణము; ఈ సంఘర్షణయందు అర్జునుని ఒక మహా రాజనీతికోద్దేశ్యమునకు యంత్రముగా నిమిత్తమాత్రునిగా యుద్ధమునందు ప్రవృత్తునిచేయుట గీతోద్దేశ్యము ; యుద్ధక్షేత్రమే బోధనాస్థలము. శ్రీకృష్ణుడు శ్రేష్ఠరాజనీతిజ్ఞుడును యోధుడునై యుండెను; ధర్మరాజ్యసంస్థాపనమె అతనిజీవిత ప్రధానోద్దేశ్యము. అర్జునుడుకూడ క్షత్రియరాజకుమారుడు : రాజనీతియు యుద్ధము అతని స్వభావనియతకర్మలు. ఇట్టి అవస్థయందు గీతయొక్క మహోద్దేశ్యమును వదలి, గీతకు కారణమగు గీతయొక్క వక్తాపాత్రలను వదలి, గీతకు వ్యాఖ్యానము చేయుటచే కలుగుప్రయోజన మెట్టిది?

చిరకాలమునుండి మానవజగత్తునందు, దానికి ఐదు ముఖ్యఆధారములు విద్యామానమై యున్నవి;— అవి, వ్యక్తి, పరివారము (కుటుంబము), వంశము, జాతి, మానవసమిష్టి. ఈ ఐదు ఆధారములపైననే ధర్మము ప్రతిష్ఠితమైయున్నది. ధర్మముయొక్క ఉద్దేశ్యము భగవద్ప్రాప్తి. దీనికి రెండుమార్గములు గలవు; విద్యపై నాధారపడియొకటి, అవిద్యపై నాధారపడి మఱియొకటి. ఈ రెండును భగవద్దర్శనమునకు ఆత్మజ్ఞానమునకు ఉపాయములే. అవిద్యామయప్రపంచమును పరిత్యజించి సచ్చిదానందమునుపొంది పరబ్రహ్మయందు లీనమగుట విద్యామార్గము. సర్వత్ర ఆత్మను భగవంతుని దర్శించి జ్ఞానమయ మంగళమయ శక్తిమయ పరమేశ్వరుని, బంధు, ప్రభు, గురు పిత మాత పుత్ర కన్య దాస సతి పత్ని

రూపములందు ప్రేమించుట అవిద్యావిధానము. విద్యామార్గముయొక్క ఉద్దేశ్యము శాంతి; అవిద్యామార్గముయొక్క ఉద్దేశ్యము ప్రేమ. కాని భగవంతుని ప్రకృతి విద్య-అవిద్యామయమై యున్నది. అందుచే మనము కేవల విద్యామార్గమును అనుసరించినచో విద్యామయబ్రహ్మను ప్రాప్తించెదము; కేవల అవిద్యామార్గమును అనుసరించుచో అవిద్యామయ బ్రహ్మను ప్రాప్తించెదము. కాని ఎవ్వరు విద్య-అవిద్యామార్గముల రెండింటిని అవలంబింతురో, వారు పూర్ణరూపముచే వాసుదేవుని పొందుదురు. వారు విద్యా-అవిద్యల రెండింటికి నతీతులు. ఎవడు, విద్యయొక్క అంతిమ లక్ష్యము వఱకే తెంచునో, వాడు విద్యాసహాయమున అవిద్యను ఆయత్తవఱచుకొనును. ఈశోపనిషత్తునందు ఈ మహాసత్యము అత్యంత స్పష్టరూపమున ఈ క్రిందివిధముగా చెప్పబడియున్నది.

అంధం తమః ప్రవిశంతియేఽవిద్యాముపాసతే,
తతోభూయ ఇవ తే తమోయ ఉ విద్యాయాం రతాః॥
అన్యదేవా హుర్విద్యయాఽన్యదేవాహురవిద్యయా,
ఇతి శుశ్రుమధీరాణాం యే నస్తద్విచ చక్షిరే॥
విద్యాం చా విద్యాం చ యస్తద్వేదోభయం సహ,
అవిద్యయా మృత్యుంతీర్త్వా విద్యయాఽమృతమశ్నుతే॥

"ఎవరు అవిద్యోపాసకులో ఆ అంధులు అజ్ఞానరూప లోకమునందు ప్రవేశింతురు. మాకు బ్రహ్మజ్ఞానమొసర్చిన ధీరులైనజ్ఞానులు, విద్యకును ఫలము కలదని

యు, అవిద్యకును ఫలము కలదనియు, ఆ రెండు ఫలములు భిన్నమనియు చెప్పగా మేము వింటిమి. ఎవరు విద్యావిద్యల రెండింటిజ్ఞానమును ఆయత్తపఱచుకొందురో, వారు అవిద్యాద్వారమున మృత్యువు నతిక్రమించి, విద్యాద్వారమున అమృతమయపురుషోత్తముని ఆనందమును ఉపభోగింతురు."

సమస్త మానవజాతియు అవిద్యను అనుభవించుచు విద్యామార్గమునకు అగ్రిసరమైయున్నది. ఇదియే వాస్తవక్రమవికాసము. శ్రేష్ఠులు సాధకులు యోగులు జ్ఞానులు భక్తులు కర్మయోగులు, ఈ మహాభియానమునందు అగ్రగాములైనికులై దూరస్థితగంతవ్యస్థానమును తీవ్రగతిచే చేరి, అక్కడనుండి తిరిగి దిగివచ్చి మనుజజాతికి సుసంవాదమును వినిపించి, మార్గమును చూపించి శక్తిని వితరణమొనర్తురు. భగవంతుని అవతారములు విభూతులు మార్గమును సుగమమొనర్చి, అనుకూలావస్థ నుత్పన్నమొనర్చి; బాధలను దూరము కావింతురు. అవిద్యయందు విద్య, భోగమునందు త్యాగము, సంసారమునందు సన్యాసము, ఆత్మయందు సర్వభూతములు, సర్వభూతములయం దాత్మ, భగవంతునియందు జగత్తు, జగత్తునందు భగవంతుడు, నగు నిట్టిఉపలబ్ధియే సరియైన జ్ఞానము; ఇదియే మానవజాతిని గంతవ్యస్థానమున చేర్చుటకు నిర్దిష్టమార్గము. ఆత్మజ్ఞానముయొక్క సంకీర్ణత, ఉన్నతికి ప్రధానాంతరాయము; దేహమును ఆత్మయని తలంచుట, స్వార్థమును కలిగియుండుట, ఈ

సంకీర్ణతకు మూలకారణములు. అందుచే నితరులను తనవలెనే జూచుట, ఉన్నతికి ప్రథమసోపానము. మనుష్యుడు మొదట వ్యక్తిభావమును పొంది, వ్యక్తిగత శారీరక,మానసిక-ఉన్నతిని, భోగమును, శక్తి వికాసమును నాశించుచుండును. నేను దేహమును మనస్సును ప్రాణమును అనియు, దేహముయొక్క బలసుఖసౌందర్యములను,మనస్సుయొక్క స్వచ్ఛతా క్షిప్రతానందములను, ప్రాణముయొక్క తేజభోగ ప్రఫుల్లతలను జీవితోద్దేశ్యమనియు, అవియే ఉన్నతియొక్క చరమావస్థ యనియు తలంచును. ఇదియే మానవుని ప్రాథమిక, లేక అసురిక జ్ఞానము. దీని ఆవశ్యతయు కలదు. మొదట శరీర ప్రాణమనస్సులయొక్క వికాసము పరిపూర్ణతల సాధించి, తర్వాత ఆ పూర్ణవికసితశక్తిని నితరుల సేవయందు ప్రయుక్త మొనరించుట యుచితము. కనుక అసురికశక్తి వికాసమును పొందుట మానవజాతి సభ్యత యొకప్రథమావస్థ. పశుయక్షరాక్షసాసురపిశాచము లన్నియు మనుష్యుని మనస్సునందు కర్మయందు చరిత్రియందు లీల యొనర్చుచు, వికాసమును పొందుచుండును. దీని తర్వాత మనుష్యుడు ఆత్మజ్ఞానమును విస్తరించుకొని యితరులను తనవలెనేచూచుట కారంభించును. ఇతరుల కొఱకు స్వార్థత్యాగ మొనర్చుట నేర్చుకొనును. మొదలు తన పరివారమును తనవలె జూచును; భార్యాపుత్రుల ప్రాణరక్షణకొఱకు స్వప్రాణత్యాగము చేయును; వారి సుఖముకొఱకు స్వసుఖమును పోగొట్టుకొనును.

దీనితర్వాత కులమును లేక వంశమును తనవలె జూచు
ను; కుల రక్షణకొఱకు ప్రాణత్యాగ మొనర్చును: తన
యొక్కయు భార్యా పుత్రాదులయొక్కయు సుఖమును
గూడ విడనాడును. అటుతర్వాత జాతిని తనవలెనే
జూచును; జాతి రక్షణకొఱకు, స్వీయప్రాణమును త్యాగ
మొనర్చును; తనభార్యా పుత్రుల యొక్కయు కులము
యొక్కయు సౌఖ్యమును బలిదాన మొనర్చును.
చిత్తూరు రాజపుత్రులందఱు రాజపుత్రజాతి రక్షణార్థము
మాటిమాటికి స్వయిచ్ఛతో నెట్లు బలిదానమొసంగి
కొనిరో, అట్లు జాతియొక్క సుఖగౌరవముల వృద్ధికొఱ
కు భార్యా పుత్రులయు కులముయు సుఖ గౌరవాభి
వృద్ధులను తిలాంజలి యొనర్తురు. దీనితర్వాత సమస్త
మానవజాతిని తనవలెనే చూచుచు, మానవజాతి
యున్నతికొఱకు భార్యాసుతులను జాతినికూడ బలిదాన
మిచ్చును. ఈవిధముగ నితరులను తనవలె జూచుట,
యితరులకొఱకు తన సుఖమును బలిదానముచేయుట
బౌద్ధధర్మము యొక్కయు, బౌద్ధధర్మప్రసూతమగు
క్రైస్తవధర్మముయొక్కయు ప్రధానబోధనైయున్నది.
ఐరోపా నైతికోన్నతి, ఈవిధముననే వృద్ధికాంచినది.
ప్రాచీన కాలపు ఐరోపీయులు వ్యక్తిని కుటుంబమునందు,
కుటుంబమును కులమునందు, లీనమొనర్చుకొనియుండిరి.
ఆధునికఐరోపీయులు, కులమును జాతియందు లీన మొన
ర్చుట నేర్చుకొనియున్నారు; జాతిని మానవసమష్టి
యందు లీన మొనర్చుట వారికింకను ' కఠిన ఆదర్శముగ

గనపడుచున్నది. టాల్స్టాయి మొదలగు మనీషీగణము యున్ను సామ్యవాదులున్ను (Socialists) అరాజకతావాదులున్ను (Anarchists) మొదలగు నవీన ఆదర్శానుమోదకులు, ఈ ఆదర్శమును కార్యమునందు పరిణతిగావించుటకు ఉత్సుకులైయున్నారు. దీని వఱకు ఐరోపీయనులు ఉత్క్రాంతి నొందగలిగియుండిరి. ఐరోపావారు అవిద్యోపాసకులు; ప్రకృతము వీరు విద్యోపాసన నర్థముచేసికొనజాలరు,

"అంధః తమః ప్రవిశంతియే అవిద్యాముపాసతే."

భారతమందు మనీషులు విద్యావిద్యల రెండింటిని ఆయత్తమొనర్చుకొనిరి. అవిద్యయొక్క పంచప్రతిష్ఠల కావల విద్యయొక్క ప్రతిష్ఠయు కూడ భగవానుడే యనియు, దీనిని తెలియనిచో, విద్య తెలియబడజాలదనియు, ఆయత్త పఱచుకొనబడజాలదనియు, వీరికి తెలియును. కనుక, కేవల మితరులను తనవలెనే మాత్రము చూడక, "ఆత్మవత్ పరదేహేషు" అనగా తమయందును నితరులయందును సమానముగా భగవంతుని దర్శించిరి. మనము స్వీయోత్కర్షనుపొంది తద్ద్వారా కుటుంబాభివృద్ధియు కుటుంబోత్కర్షద్వారా కులోత్కర్షను సాధించి, దీనిద్వారా జాత్యుత్కర్షయు, జాత్యాభివృద్ధిద్వారా, మానవసమష్ట్యభివృద్ధియు జరుగవలెననెడిజ్ఞానము, ఆర్యుల సామాజిక వ్యవస్థయందును, ఆర్యశిక్షణ మూలమునందును నిహితమైయున్నది. వ్యక్తిగత త్యాగము ఆర్యుల మజ్జాగతాభ్యాసమైయున్నది.

కుటుంబము, కులము, జాతి, మానవసమష్టి, భగవాను డు, వీనికొఱకు వ్యక్తిత్యాగము చేయునభ్యాసము మన స్వభావమునందు స్థిరపడియున్నది. మనవిద్యలో చూప బడినదోషము, లేక లోపము ఐతిహాసిక కారణముల ననుసరించుటచే కలిగినది; సమాజమునందు జాతిని కనుగొని సామాజికహితమునందు వ్యక్తియొక్కయు కుటుంబముయొక్కయు హితమును లీన మొనర్చుచుంటి మికాని, జాతియొక్క రాజకీయ జీవనవికాసమును పొం దుట, మనధర్మముయొక్క అంతర్గత ముఖ్యాంగ రూప ముగా స్వీకరింపబడలేదు. పాశ్చాత్యదేశమునుండి ఈ బోధను మనము పొంద నవసరమున్నది. కాని మన ప్రాచీన శిక్షణయందు, మహాభారతమందు, గీతయందు రాజపుత్రుల యితిహాసమునందు, రామదాసు దాసు బోధయందు ఈశిక్షణ మనదేశములోగూడ కనబడు చున్నది. అత్యధిక విద్యోపాసనకారణముచే అవిద్యా భయముచే ఈశిక్షణ వికాసమును కూర్చుకొనలేదు. మఱియు ఆదోషముచేతనే తమోభిభూతులమై జాతిధర్మ మునుండి చ్యుతులమై, కఠినదాసత్వ దుఃఖాజ్ఞానము లందు పడిపోయి, అవిద్యను ఆయత్త మొనరించుకొనలేక విద్యాప్రాప్తిని పోగొట్టుకొంటిమి.

"తతోభూయ ఇవతే తమోయ ఉ విద్యాయాం రతా."

## శ్రీకృష్ణుని రాజనీతికోద్దేశ్యము

### మానవ సమాజపు క్రమిక వికాసమునుకూర్చి

డివి రెండు భిన్నవస్తువులు, కులము, జాతి. ప్రాచీన కాలమునందు వీని భిన్నత భారతదేశమునందును అట్లే అన్యదేశములందును, నిప్పటి యింతపరిస్ఫుటముగ నుండ లేదు. కొన్ని గొప్పగొప్పకులముల సమ్మేళనముచే జాతి యేర్పడుచుండెను. ఈ కులములు ఒక్కటియైనను, ఒక్క పూర్వ పురుషునికి చెందిగాని లేక వేర్వేఱు వంశజులకు చెందిగాని యుండినచో, ప్రీతిసంబంధస్థాపితముగ నవి నుండిన, ఒకేవంశముగ పాటింపపడుచుండెడిది. సమస్త భారతదేశము ఒకగొప్పజాతిగా నేర్పడలేదు కాని, దేశ మంతటను వ్యాపించిన గొప్పగొప్ప జాతులయందు, ఒకేసభ్యత, ఒకేధర్మము, ఒకే సంస్కృతభాష, అట్లే వివాహాది సంబంధములు కూడియుండెను. అయ్యును ప్రాచీన కాలమునందు ఈ యేకత్వము నొనరించెడి కార్యము జరుగుచుండెడిది. అప్పుడప్పుడు కురువంశము, లేక కోశలవంశము, లేక మగధవంశము దేశమునకు నాయకత్వము సార్వభౌమత్వము నేర్పఱుప ప్రయత్న ములు జరిగెను. కాని ప్రాచీన కులధర్మము మఱియు కులమునకుగల స్వాధీనస్వాతంత్ర్యప్రియత, ఈయేకత్వ కార్యమునందు ప్రబలాటంకములుగా నుండి, యేకత్వ మెప్పుడును చిరకాలస్థాయిగా నేర్పడలేదు. భారత దేశమునందు, ఈ యేకత్వకార్యము, అసపత్న సామ్రా జ్య స్థాపన మేర్పఱచు నీకార్యము పుణ్యకర్మగను, రాజుల కర్తవ్యకర్మగను పరిగణింపబడెడిది. ఈయేకత్వ భావముయొక్క ప్రాబల్యమును తెలిసికొనుటకు, చేది

రాజగు శిశుపాలుడు ఎంతో తేజస్వియు దుర్దాంత క్షత్రియుడైయుండియు, యుధిష్ఠరుని సామ్రాజ్యసంస్థాపన కార్యమును పుణ్యకర్మగా తలంచి అందుకు సాహాయ్యము చేయ సమకట్టియుండెననుటయే, చాలును. సామ్రాజ్య, లేక ధర్మరాజ్యస్థాపనముద్వారా ఈ విధమైన ఏకత్వమే, శ్రీకృష్ణుని రాజనీతియందలి యుద్దేశ్యము. మగధరాజగు జరాసంధుడు తత్పూర్వమే యిట్టి ప్రయత్నము చేయుచుండెను; కాని అతనిశక్తి అధర్మ-అత్యాచారములపై ప్రతిష్ఠితమైయుండెను. అందుచే దానిని క్షణస్థాయిగా దలంచి, శ్రీకృష్ణుడు అతనిని భీముని చేతులతో వధ కావించి ఆతనికార్యమును విఫల మొనర్చెను. శ్రీకృష్ణునికార్యమందు, అన్నింటికన్న బాధాకరమైనది, తేజోవంతము దురభిమాన పూరితము నగు కురువంశ విషయము. కురుజాతి చాలకాలమునుండి భారత దేశ నేత్రస్థానీయజాతియైయుండెను. ఆంగ్లభాష యందు హెజిమోని (Hegemony) అనగా, అనేక సమాన స్వాధీనజాతులందు ప్రధానత్వ నేతృత్వములు కలిగియుండుటయని చెప్పబడునది, కౌరవజాతికి పురుష పరంపర గతాధికారమై యుండెను. ఈకౌరవజాతి బల గర్వములు, అక్షుణ్ణముగా నుండునంతకాలము భారత దేశమునందు ఏకత్వస్థాపితము సాధ్యముకాదని శ్రీకృష్ణుడు తలంచెను. అందులకే అతడు కురువంశమును ధ్వంసముచేయ సంకల్పించెను. కాని భారతదేశమున సామ్రాజ్యస్థాపనము, కౌరవజాతి పరంపరాగత అధికార

మనుమాట అతడు మఱువలేదు. మఱియు, ధర్మతః ఎవ్వారికేది ప్రాప్తమో, వారిని వానినుండి వంచించుట అధర్మమని అతడు తలంచి. కౌరతజాతియందు న్యాయతః రాజును ప్రాధాన్యుడునునైన యుధిష్ఠరుని భావి సామ్రాజ్యపదవికి నియుక్తమొనరించుటకు మనోనిశ్చితుడై యుండెను. శ్రీకృష్ణుడు పరమధార్మికుడును సమర్థుడునునైయుండియు, ప్రేమకు వశుడై తన ప్రియయాదవ కులమును కురుజాతిస్థానమునందు నిలువబెట్ట ప్రయత్నించలేదు. కేవలము అవస్థయు పరంపరాధికారము పాటించినచో అనిష్టము సంభవించునుగనుక, గుణమును సామర్థ్యమునుకూడ చూడవలెను. యుధిష్ఠరుడు, అధార్మికుడు అత్యాచారియు, శక్తిహీనుడునునైయుండెనేని, శ్రీకృష్ణుడు మరొకరిని వెతకి ఆ స్థానమున యుంచవలసినవాడైయుండెను. యుధిష్ఠరుడెట్లు వంశక్రమానుసారముగను పూర్వప్రచలిత నియమానుసారముగను, న్యాయపూర్ణాధికారమునకును, సామ్రాజ్య పదవికిని ఉపయుక్తుడో అట్లే గుణములచేకూడ నా పదవికి యథార్థాధికారియై యుండెను. అతనికంటె అధిక తేజస్వులు, ప్రతిభావంతులునైన అనేక గొప్ప వీరరాజులుండిరి; కాని కేవల ప్రతిభలచే రాజ్యాధికారము పొందు అర్హత కలుగదు. ధర్మరక్షణయు ప్రజారంజనయు దేశరక్షణయుకూడ జరుగవలెను. మొదటి రెండు గుణములయందు యుధిష్ఠరుడు అతులనీయుడు. అతడు ధర్మపుత్రుడు దయావంతుడు న్యాయపరాయణుడు

సత్యవాది. ప్రజలను అత్యంతముగ ప్రేమించినవాడు. శేషోక్త ఆవశ్యక గుణములయందుగల లోపములను పూరించుటకు, అతని సోదరులు భీమార్జునులు సమర్థులై యుండిరి. పంచపాండవులతో సమానులగు పరాక్రమ వంతులగువారు వారి సమకాలమున మఱియొకరు లేరు. కనుక జరాసంధుని వధమూలమున దేశము నిష్కంటక మైనకారణమున, శ్రీకృష్ణుని పరామర్శచే యుధిష్ఠిరుడు ప్రాచీనకాలదేశ ప్రణాలి ననుసరించి రాజసూయ యజ్ఞము సలిపి సమ్రాట్టుపదవి నందెను.

శ్రీకృష్ణుడు ధార్మికుడు, రాజనీతివిశారదుడు. సామాజిక నియమములకులోబడి కార్యములొనర్చుటచే ఆయన దేశధర్మ ప్రణాలి మహదోద్దేశ్యము సిద్ధించు సంభవనీయత యుండగా, ధర్మమునకు హాని, ప్రణాలికి విరుద్ధము, నియమములకు భంగము నగు విధమున ఆయన వర్తించవలసిన పనియేమి? కారణము లేకయే యిట్టి రాజవిప్లవములను సమాజవిప్లవములను కలుగ జేయుట అహితకరము. ఇందుచేతనే పురాతన ప్రణాళికను కాపాడుచును, తన ఉద్దేశ్యమును నెరవేర్చుటకు ప్రయత్నించెను. కాని ప్రాచీనప్రణాళికలో నొక లోపముండెను; అదేదన, కడుప్రయాసచే అది నెరవేరినను దాని ఫలము స్థాయిగానుండగల సంభావ్యత చాల అల్పముగానుండెను. అప్పటిలో సామరికబలము నధికముగా గలవారు రాజసూయయాగముచేసి సమ్రాట్టు పదవి నొందగలుగుచుండిరి: కాని అతని వంశజులు

తేజోవిహీను లగునంతనే, ఆపదవి స్వయముగా తొలగుచుండెను. తండ్రికి లేక పితామహునికి లోబడిన తేజస్వంతులగు వీరజాతులు పుత్రునికి లేక పౌత్రునికి నేల లోబడవలయును? వంశానుగతముగ పొందిన అధికారమునకు గాక, రాజసూయయాగముచే పొందిన అధికారమునకే అధికగౌర ముండెను; అందుచే అధిక బల వీరంవంతు లాయాగమునుచేసి సమ్రాట్టు లగుచుండిరి. మరెవ్వరైన సమ్రాట్టుపదవిని పొందుట కిష్టపడనిచో, మఱికొంత కాల మతనికి ప్రాధాన్య (Hegemony) ముండెడిది. ఈ పద్ధతిలో మఱియొకదోష ముండెను. నూతనసమ్రాట్టు ఆకస్మికముగా బలశాలియై, సర్వప్రాధాన్యతను పొందుకారణముచే, బలాభిమానులు అసహిష్ణులు తేజస్వులు నగు క్షత్రియులహృదయములలో ఈర్ష్యావహ్ని ప్రజ్వలితమగుచుండెడిది; అతడేల ప్రాధాన్యతనుపొందెను, మనమేల కాకూడదను విచారము సహజముగనే సంభవించుచుండెను. యుధిష్ఠరుని కులమునందలి క్షత్రియులుకూడ నిట్టి ఈర్ష్యచే నతనికి విరోధులైరి. అతని దాయాదులగు దుర్యోధనాదులు అతని నీకారణముచేతనే, చాతుర్యముగ పదచ్యుతునిగ నిర్వాసితునిగ నొనర్చిరి. దోషయుక్త ప్రణాలియొక్క దోషము కొంతకాలములోనే ప్రకటితమయ్యెను.

శ్రీకృష్ణు డెట్టికర్మయోగో, అట్టి రాజకీయవేత్త. దోషపూరితమును అహితకరమును నగు తత్కాలానుపయోగ ప్రణాళిని, ఉపాయమును నియమమును మార్చు

టలో ముందువెనుకలు చూచువాడుకాదు. అతడు తన యుగములో ప్రధానవిప్లవకారియైయుండెను. భూరిశ్రవుడనురాజు శ్రీకృష్ణుని నిందించుసమయమున, సమకాలిక ప్రాచీనమతావలంబు లనేకుల ఆక్రోశమును వెల్లడించుచు, కృష్ణుఁడును కృష్ణచాలిత యాదవకుల మెప్పుడును ధర్మవిరుద్ధమును ఆచరించుటలో, దానిని వికృత మొనరించుటలో జంకరనియు, కృష్ణుని పరామర్శించుకార్యములు చేయువారందఱును తప్పక శీఘ్రముగ పాపమునపడెదరనియు చెప్పెను. ఏలయన ప్రాచీనాచారముల బట్టుకొని ప్రేలాడువారిదృష్టిలో నూత్నభావములన్నియు దోషములే. శ్రీకృష్ణుడు యుధిష్ఠరుని కష్టమెఱింగియుండెను; ఏలయన అతడు భగవంతుడు. అందుచే ద్వాపరయుగమున కుపచరించుపద్ధతి కలియుగమున నిల్వజాలదని తలంచి, కలికాలమున కుపయుక్తమైన భేదదండోపాయములు గల రాజనీతిని ఉపయోగించి గర్వముగల క్షత్రియజాతి బలమును నాశనమొనర్చి భావిసామ్రాజ్యమును నిష్కంటకముగా జేయసంకల్పించెను. శ్రీకృష్ణుడు కౌరవులకు పురాతన సమకక్ష శత్రువులగు పాంచాలిజాతిని కౌరవ నాశనమునకు ప్రేరేపించి కౌరవజాతిపై ద్వేషముచేతను, యుధిష్ఠరునిపై ప్రేమచేతను, ధర్మరాజ్యసంస్థాపనకును, ఏకత్వమునకును తదితర జాతులనుకూడ నీపక్షమునకు దెచ్చి యుద్ధప్రయత్నమును కావించెను. శ్రీకృష్ణునునికి సంధి కుదురునని నమ్మకము లేదు. సంధిజరుగదనియు, జరిగినను నెక్కువ

కాలము నిల్వజాలదని నెఱిగియు, ధర్మముకొఱకును రాజనీతికొఱకును సంధిప్రయత్నము చేసెను. శ్రీకృష్ణుని రాజనీతియొక్క ఫలితమె కురుక్షేత్రసమరమనుట కిసుమంతయు సందేహము లేదు. కురుధ్వంసము, క్షత్రియ ధ్వంసము నిష్కంటక సామ్రాజ్యము, భారతదేశ యేకత్వ సంస్థాపనయు, ఆయన యుద్దేశ్యములు - ధర్మరాజ్య స్థాపనకగు యుద్ధమే ధర్మయుద్ధము. అట్లే ధర్మయుద్ధము యొక్క ఈశ్వరనిర్దిష్ట విజేత, దివ్యశక్తి ప్రణోదిత మహారథికుడు అర్జునుడు. అట్టి అర్జునుడు అస్త్రత్యాగము కావించుటచే, శ్రీకృష్ణుని రాజకీయపరిశ్రమ వ్యర్థమగును; భారతదేశమున ఏకత్వము స్థాపనకాదు. మఱియు శీఘ్రముగనే దేశముయొక్క భావిజీవనమందు ఘోరావస్థలు వాటిల్లును.

## భ్రాతృవధ — కులనాశనము

అర్జునుని సమస్తయుక్తియు కులహితముననే ప్రయుక్తమైయుండెను, జాతిహితముకొఱకు కాదు. అతడు కురువంశహితమును విచారించుటలో భారతదేశ హితమును మఱచెను. అధర్మభయముచే ధర్మమునకు తిలాంజలి నిచ్చుటకు కటిబద్ధుడయ్యెను. స్వార్థముకొఱకు భ్రాతృవధచేయుట మహాపాపమని సర్వులు నెరుంగుదురు. కాని భ్రాతృప్రేమకు వశీభూతుడై జాత్యనర్థమునకు సహాయకారియగుట, జాతిహితమునకు సిద్ధపడకుండుటయు, అంతకన్నను మహాపాపము. అర్జునుడు శస్త్రత్యాగముచేయుచో, అధర్మము జయించును; దుర్యో

ధనుడు భారతదేశ ప్రధానరాజును నాయకుడునునై, జాతీయచరిత్రయందు క్షత్రియ కులాచరణయందు తన చెడు దృష్టాంతమును కనబఱచి కలుషితమొనరించిన నాడు, భారతదేశమునయున్న పరాక్రమ కులములన్నియు స్వార్థము, యీర్ష్య మొదలగువానిప్రేరణచే ఒండొరుల నాశము గావించుకొని, దేశమున ఐకమత్యము న్యాయపరిపాలన లేకపోవుటచే వెంటనే విదేశీయులు వచ్చి ఆర్యసభ్యతను ధ్వంసమొనర్చి ప్రపంచ భావిహితావకాశమును నిర్మూలించెడివారు. శ్రీకృష్ణార్జునులచే ప్రతిష్ఠితమైన సామ్రాజ్యము నాశమగుటకు, ప్రాయికముగ ౨౦౦౦–సంవత్సరముల అనంతరము భారతదేశమున ఆరంభమైన రాజనీతికోత్పాతము, అప్పుడే ఆరంభమయ్యెడిది.

అర్జును డెట్టిఅరిష్టములు కలుగునని యుద్ధమొనర్చుటకు భయపడెనో నిజముగా నవియే కురుక్షేత్ర సంగరముచే కలిగెనని లోకులు కొందఱందురు. భ్రాతృవధ, కులనాశనము, జాతినాశనము, కురుక్షేత్ర యుద్ధ ఫలితములు. కురుక్షేత్రయుద్ధమునకు కలి ఆరంభమే కారణము, ఈయుద్ధమునందు భీషణ భ్రాతృవధ జరిగినది. కాని శ్రీకృష్ణుని మహోద్దేశ్యము ఎట్లు సిద్ధించవలెననునదియే ప్రశ్న. కనుక శ్రీకృష్ణుడు సంధి జరుగదని తెలిసియు, అందుకు ప్రయత్నము సలిపెను. అయిదూళ్లైనను నిచ్చినచో యుధిష్ఠిరుడు యుద్ధము చేసియుండెడివాడుకాడు; ఏలయన పాదముమోపుటకు తగిన

స్థలముదొరికినను శ్రీకృష్ణుడు ధర్మరాజ్యసంస్థాపన చేయగలడు. కాని యుద్ధముచేయనిదే, సూదిమొన మాత్రభూమినైనను నివ్వనని దుర్యోధనుడు నిశ్చయించెను. సమస్తదేశ భవిష్యమంతయు యుద్ధఫలముపై నిర్భరమైయుండ, ఆయుద్ధమునుండి భ్రాతృవధ కారణమని, ఆమహాకర్మనుండి వేఱువడుట అధర్మమగును. కుటుంబహితమును జాతిహితమును ప్రపంచ హితములో లీన మొనర్చవలెను. భ్రాతృప్రేమచే కుటుంబప్రేమచే కోట్లకొలది ప్రజల భావిసుఖమును, లేక దుఃఖ విమోచనకు వినష్టమొనరించకూడదు; అన్యవిధమున. వ్యక్తికిని కులమునకు నరకమే ప్రాప్తించి యుండెడిది.

కురుక్షేత్రసంగరమున కురునాశము జరిగినది సత్యమే. ఈయుద్ధఫలస్వరూపము, మహాప్రతాపశాలి కురువంశ మొక్కసారిగా లుప్తమగుట. అయినను కౌరవజాతి నాశనముచే, సమస్త భారతజాతి రక్షింపబడియుండెనేని అందువలన లాభమే కలిగినదని చెప్పవలెను. కుటుంబప్రేమ మాయగా నేర్పడగలిగిన ట్లే కులప్రేమయు మోహముగా నేర్పడగలదు. సోదర దేశీయుడు, దేశమునకు హాని యొనర్చినను, దుర్మార్గుడై ప్రవర్తించినను, దేశమునకు సర్వనాశము గావించినను, అతడు నాసోదరుడు, స్నేహపాత్రుడు అని, అతనిని సహించవలెననెడి భావన మనయందుత్పన్నమయ్యేనేని, అట్టి వైష్ణవమాయామాత్రమాత— అధర్మము, ధర్మముయొక్క వేషమునుదాల్చి అనేక ప్రజలబుద్ధిని భ్రంసమొనర్చును; ఇది కులమునందుగల

మాయామోహముచే నుత్పన్నమగునదియే. నిష్కారణముగనో, స్వార్థమునుగూడియో, సరియైన ప్రయోజనము లేకనో, ఆవశ్యకత లేకనో, సోదర దేశీయునితో కలహించుట విరోధించుట అధర్మము. కాని అతడు మాతృదేశమున కపకారమొనర్చుటకు సిద్ధపడినపుడు వాని దుర్మార్గమును సహించి అట్టులవాడు దేశారిష్టము చేసినను ప్రేమించుట మహాపాపము. ముసల్మానుల పృష్టపోషక దేశసోదరులను శివాజీ సంహరించినపుడు, అతనితో నెవ్వరైన, "ఆహా ఏమిచేయుచున్నావు, వారు దేశసోదరులు, వారిని సంహరించకుము; మొగలులు మహారాష్ట్ర దేశమునుపాలించిననుసరే, మహారాష్ట్రులు తమలో తాము ప్రేమించుటయే న్యాయము," అని చెప్పినచో నిది హాస్యాస్పదముకాదా? అమెరికాలో దాసప్రథమును (Slavery) తొలగించుటకు జరిగిన ప్రయత్నములో, అంతర్యుద్ధమొసగినపుడు, అనేక వేలు దేశీయులు హత్య కావింపబడిరి. దీని నెవ్వరేని తప్పయని చెప్పగలరా?

అనేక సమయముల దేశీయులతో విరోధము వహించుట, దేశీయులను యుద్ధమునందు చంపుట జాతికిని జగత్తునకును మేలుగావించుటకు, ఏకమాత్రోపాయముగా నుండును. ఇందువలన కులనాశనము కలిగినను జాతి జగత్తుల హితసాధనలకు వెనుదీయరాదు. కులరక్షణ, జాతి హితముకొఱ కావశ్యకమైనచో సమస్య జటిలమేయగును. మహాభారతకాలమున జాతి ప్రతిష్ఠింపబడియుండలేదు. అందు కులమునే, మానవజాతియొక్క

కేంద్రస్థానముగ తలంచియుండిరి. అందుచే భీష్మద్రోణు లు మొదలగువారు, పురాతన విద్యాస్వరూపులైనవారు, పాండవులకు విరుద్ధముగ యుద్ధముసల్పిరి. వీరు ధర్మము పాండవులపక్షమున నున్నదనియు, ఏకసామ్రాజ్య స్థాపనచే సమస్తభారతమును ఏకకేంద్రమున ఆబద్ధ మొనరించు టావశ్యకమనియు వారికి తెలియును. కాని వారు, కులమే ధర్మమునకు ఆధారమనియు, జాతికికూడ నిదియే కేంద్రమనియు, కులనాశనమగుటచే ధర్మ రక్షణయు జాతిసంస్థాపనయు అసంభవమని తలంచిరి. అర్జునుడు కూడ నిట్టిభ్రమయందే తగుల్కొనెను. ఈ యుగము నందు జాతియే ధర్మమున కాధారము, మానవసమాజ మునకు కేంద్రము. జాతిరక్షణ, ఈయుగముయొక్క ప్రధానధర్మము; జాతినాశనముకావించుట ఈ యుగము నందు అమార్జనీయ మహాపాతకము. ప్రపంచమంతయు నొకేమానవసమాజముగా ప్రతిష్ఠితమగుకాలము రాగ లదు. అప్పుడు మహాజ్ఞానులు మహాకర్మయోగులు జాతి ధర్మముననుసరించి జాతిరక్షణకొఱకు యుద్ధమొనర్తురు; రెండవపక్షమున శ్రీకృష్ణుడు విప్లవకారియై, నూతన కురుక్షేత్రయుద్ధమును, సంఘటిల్లజేసి, జగత్తుయొక్క హితమును సాధించుగాక.

## శ్రీకృష్ణుని రాజనీతి ఫలము

అర్జునుడు మొదలు కృపావేశముచే కులనాశన మును గుఱించి అధికదుఃఖమును బొందెను. ఎవ్వరుగాని యింతటి బృహత్తర సైన్యసమావేశమును జూచినచో,

కులచింతయు జాతిచింతయు స్వయముగనే వారి మనస్సు నం దుద్భవించును. జాతిహితచింతన, ఆధునిక కాలమం దెట్లు మనుష్యజాతికి స్వాభావికమో, అట్లే ఆకాలమున భారతీయులకు కులహితచింతన స్వాభావికమని ముందే చెప్పియున్నాము. కాని కులనాశమగుటచే జాతికిగల ఆధారము లేకపోవునా యనెడి సంశయము సరియగు నా? అర్జునుడు భయపడిన విషయములే తర్వాత సంభవించెననియు, కురుక్షేత్రయుద్ధమే భారతదేశ అవనతికి, దీర్ఘకాల పరాధీనతకు మూలకారణమని అనేకులు తలంతురు. తేజస్వంతులగు క్షత్రియవంశజులు వినాశమొందుటచే, క్షాత్రతేజము సన్నగిల్లి భారతదేశమునకు అమంగళము కలిగెనని వారిభావము. ఎవరి చరణములయందు అనేక హిందువులిప్పుడు శిష్యభావమున తమ శిరముల నిడుచున్నారో అట్టి విఖ్యాత విదేశాంగన;—క్షత్రియజాతి నాశనముచే—బ్రిటీషు సామ్రాజ్యస్థాపనమార్గమును సుగమమొనర్చుటకే స్వయముగా భగవంతుడు శ్రీకృష్ణావతారము దాల్చెనని చెప్పుటకెంతమాత్రమును సందేహించలేదు. ఇట్టి అసంబద్ధపు మాటలు చెప్పువారివిషయమును చక్కగా నాలోచించక, అత్యంత-అగణ్య రాజనీతి కుతత్వమునకు వశీభూతులై, శ్రీకృష్ణుని రాజనీతియందు దోషములు కనబఱుచెదరని మానమ్మకము. ఇట్టి రాజకీయతత్వము, మ్లేచ్ఛవిద్యచే అనార్యచింతనా ప్రణాలిచే నుత్పన్నమైనది. అనార్యులు, ఆసురికబలమే అధికమైనదనియు, అట్టి బల

మే స్వాతంత్ర్యమునకును జాతీయ మహత్త్వమునకును ఏకమాత్ర-ఆధారమనియు తలంతురు.

జాతీయ మహత్త్వము కేవల క్షాత్రతేజముపై ప్రతిష్ఠింపబడజాలదు. చాతుర్వర్ణముల చతుర్విధతేజమే యీమహత్త్వన కాధారము. సాత్త్వికమగు బ్రహ్మతేజము, మధురసంజీవనీసుధచే రాజసిక క్షాత్రతేజమును, జ్ఞానము వినయము పరహితచింతనా రూపములందు జీవితమును నిర్మించును; క్షాత్రతేజము, శాంతబ్రహ్మ తేజమును రక్షించును. క్షాత్రతేజరహిత బ్రహ్మతేజము తమోభావముచే ఆక్రమింపబడి శూద్రత్వముయొక్క నికృష్టగుణములకు ప్రశ్రయమగును. అందుచే క్షత్రియులు లేనిచోట బ్రాహ్మణులుండుట నిషేధింపబడెను. క్షత్రియవంశము లోపించినచో నూతనక్షత్రియుల సృష్టించుట బ్రాహ్మణుని ప్రథమ కర్తవ్యము. బ్రహ్మతేజరహితమైన క్షాత్రతేజము, దుర్దాంత-ఉద్దామ-ఆసురిక బలమునందు పరిణతిపొంది, మొదట పరహితమును వినాశనమొనరింప ప్రవృత్తమై కడపట తానే నాశన మొందును. అసురుడు బలాతిరేకముచే, పతితుడై సమూలముగా నాశనమొందునని రోమను కవి సత్యమునే పలికియుండెను. సత్త్వగుణము రజోగుణమును సృష్టించవలెను; రజోగుణము సత్త్వమును రక్షించవలెను, సాత్త్విక కార్యమునందు నియుక్త కావలెను. అప్పుడు మాత్రమే, వ్యక్తికి జాతికి శ్రేయస్సుకలుగును. సత్త్వ గుణము రజోగుణమును కబళించిన, అట్లే రజోగుణము

సత్వగుణమును గ్రహించిన తమోగుణము ప్రాదుర్భ వించును; విజయముగాంచిన గుణము, స్వయంపరాజిత మై, తమోగుణముయొక్క రాజ్యము వ్యాపించును. బ్రాహ్మణు డెప్పుడును రాజు కాజాలడు; క్షత్రియుడు నాశనమొందుటచే శూద్రుడు రాజగును. అప్పుడు బ్రాహ్మణుడు తామసభావమునుపొంది అర్థలోభముచే జ్ఞానమును విక్రృతమొనర్చి, శూద్రునికి దాసుడై, ఆధ్యాత్మిక భావనిశ్చేష్టతను పోషించి, తాను మ్లానుడై, ధర్మము అవనతి చెందుటకు కారణమగును. క్షత్రియ రహితమైన శూద్రచాలితజాతి దాసత్వపు నోటియందు బడిపోవును. భారతఖండమున కీఅవస్థయే కలిగియున్నది. రెండవపక్షమున,ఆసురిక బలప్రభావముచే క్షణికఉత్తేజ మును, అందుచే శక్తిసంచారమును మహత్వప్రాప్తియు కలుగగలిగినను, శీఘ్రముగ దుర్బలతయు గ్లానియు కలుగుచుండును; శక్తి నశించి దేశము క్షీణదశకు వచ్చును; కాదేని రాజసిక వికాసము, దంభము, స్వార్థ వృద్ధియు కలిగి, జాతి నిరుపయోగమై, స్వకీయ మహత్వ మును రక్షించుకొన సమర్థము లేకుండును; లేక, అంతర్విరోధము దుర్నీతి అత్యాచారములచే దేశము చెడి పోయి శత్రువులకు సులభ లభ్యమగు విహార షికారి వనమైపోవును.హిందూదేశచరిత్రయందునుసిట్టిపరిణామ ములతో కూడిన ఉదాహరణములు చాల కననగును.

మహా భారతకాలమున ఆసురిక బలభారముచే పృథ్వి వ్యాకులము నొందియుండెను. భారతదేశమున

నింతటి తేజస్వులు పరాక్రమశాలులు ప్రచండక్షత్రియ తేజ వికాసులు, తత్పూర్వముగాని, తర్వాతగాని జనించ లేదు. కాని యీభీషణ బలమునందు సదుపయోగమగు సంభవనీయత చాల తక్కువయుండెను. వారందఱు ఆసురికప్రవృత్తికలవారై,-అహంకార దర్ప స్వార్థ స్వేచ్ఛాచారము వారి ప్రతిరక్తకణమునందును నిండినవారై యుండిరి. శ్రీకృష్ణుడు ఈబలమును నాశముగావించి ధర్మరాజ్య స్థాపనకావించనిచో, పైన పేర్కొనబడిన త్రివిధ పరిణామములలో నేదియోనొకటి నిశ్చయముగా జరిగెడిదే. భారతదేశము ఆకాలముననే మ్లేచ్ఛుల స్వాధీనమయ్యెడిది. ౫౦౦౦-సంవత్సరములకుపూర్వము, కురుక్షేత్రయుద్ధము జరిగెననియు, ౨౫౦౦-సంవత్సరములు గడచినపిమ్మట మ్లేచ్ఛుల ప్రథమాక్రమణ సింధునది అవతలిగట్టువఱకు వ్యాపించెనని జ్ఞాపకముంచుకొనవలెను. అందుచే అర్జునునిద్వారా ప్రతిష్ఠితమైన ధర్మరాజ్యము అప్పటివఱకు బ్రహ్మతేజ-అనుప్రాణిత క్షాత్రతేజ ప్రభావముచే దేశరక్షణ బడసియుండెను. అప్పుడు కూడ దేశమునందు సంచిత క్షాత్రతేజముయొక్క భగ్నాంశమే, ౨౦౦౦-సంవత్సరములవఱకు దేశమును కాపాడెను. చంద్రగుప్తుడు పుష్యమిత్రుడు సముద్రగుప్తుడు విక్రముడు సంగ్రామసింహుడు ప్రతాపుడు రాజసింహుడు ప్రతాపాదిత్యుడు శివాజీ మొదలగు మహాపురుషులు ఆ క్షాత్రతేజోబలముచేతనే దేశదౌర్భాగ్యముతో బోరాడిరి. గుజరాతు యుద్ధమున ఝాంసీలక్ష్మీబాయి

యొక్క రీతితో చాని శేషాగ్నికణము ఆరిపోయెను. ఆ నాటితో శ్రీకృష్ణుని రాజనీతియొక్క సుఫలప్రయత్నములు క్షీణించిపోయెను. భారతదేశమును ప్రపంచమును రక్షించుటకు పూర్ణావతారము మరల రావలసిన ఆవశ్యకత కలదు. ఆ అవతారము, లుప్తమైన బ్రహ్మ తేజస్సును తిరిగి మేల్కొల్పును; ఆ బ్రహ్మతేజము క్షాత్ర తేజమును సృష్టించును. శ్రీకృష్ణుడు భారతదేశ క్షాత్ర తేజమును కురుక్షేత్రమున నాశ మొనర్పకపోవుటయే గాక అసురబలమును హతమొనరించి బ్రహ్మతేజమును క్షాత్ర తేజమును కాపాడెను. అసుర బలాన్వితమైన క్షత్రియ వంశ సంహారము చేనుద్దామరజశ్శక్తిని నాశనమొనర్చిన మాట సత్యమే. ఇట్టి మహావిప్లవము, అంతర్విరోధము యొక్క యుత్కట భోగముద్వారమున క్షీణమై నిగ్ర హింపబడుటచే, ఉద్దామక్షత్రియ కులసంహారము కావింప బడుటచే అనిష్టకారక మెప్పుడును కాదు. అంతర్విరోధక రోమను క్షత్రియ కులనాశముచే, రాజ్యతంత్రస్థాపన మై రోమను విరాట్సామ్రాజ్యము అకాలమృత్యువునోటి నుండి తప్పిపోయెను. ఇంగ్లాండులో శ్వేతరక్త గులాబీల అంతర్విరోధముచే క్షత్రియకుల నాశమై నాల్గవఎడ్వర్డు, ఎనిమిదవ హెన్రి, ఎలిజబేత్ రాణి ఆధునిక ఆంగ్లేయప్రజల రాజ్యమునకు పునాదులు వేయగలిగిరి. కురుక్షేత్రయుద్ధ ముకూడ భారతదేశమున కిట్టిరక్షణయే యొసంగెను.

కలియుగమున భారతదేశము క్షీణించుచున్న దనుమాట నెవ్వరును త్రోసివేయజాలరు. కాని అధో

గతిని తెచ్చుటకు భగవంతు డవతరించియుండలేదు. ధర్మరక్షణ ప్రపంచరక్షణ ప్రజారక్షణలకొఱకు భగవాను డవతరించును. విశేషముగ కలియుగమున పూర్ణభావమున భగవంతు డవతరించును. ఏలయన, కలియుగమున మానవుని పతన మధికమై అధర్మాభివృద్ధి స్వాభావికమగును. కనుక మానవజాతి రక్షణకు అధర్మనాశనము ధర్మసంస్థాపనము సల్పుటకొఱకు, కలియుగపు నడకను ఆటంకపఱచుకొఱకు నీయుగమున భగవంతుడు విశేషముగ నవతారములదాల్చును. శ్రీకృష్ణు డవతరించినపుడు కలిరాజ్యారంభమయ్యెను. భగవానుని ఆవిర్భావభీతిచే కలి తన రాజ్యమున కాలిడజాలకపోయెను. ఆయన ప్రసాదముచే, పరీక్షిత్తు కలికి పంచగ్రామములు దానమొనర్చి దాని ఆధిక్యమును ఆపివేసెను. కలియుగారంభమునుండి అంత్యమువఱకు కలిపురుషునికిని మానవునికిని జరుగునట్టియు జరుగుచుండునట్టియు సంగ్రామమున సాహాయ్యముచేయుటకు నాయకరూపమున పరమాత్మ అవతరించి బ్రహ్మతేజము జ్ఞానము భక్తి నిష్కామకర్మల బోధించి రక్షించును. భారతఖండమును రక్షించుటయే మానవకల్యాణమునకు పునాదియు ఆశాస్థలమును. భగవంతుడు కురుక్షేత్రమున మనుష్యజాతిని రక్షించెను. ఆరక్తసముద్రమున నూతన జగత్తుయొక్క లీలాపద్మమునందు కాలరూపుడగు విరాట్పురుషుడు విహారమొనర్చ నారంభించెను.



# గీ తా భూ మి క

# తృతీయకల్పము

## గీతా ద్వితీయాధ్యాయము

సంజయ ఉవాచ:—

తం తథా కృపయాఽవిష్ట మశ్రుపూర్ణాకులేక్షణమ్,
విషీదంత మిదం వాక్య మువాచ మధుసూదనః. ౧

సంజయుడు పలికెను:—

అట్లు కృపావేశుడై కన్నుల నీరు గ్రమ్ముచుండ విషాదము నొందుచున్న అర్జునుని జూచి మధుసూదను డిట్లు చెప్పుచున్నాడు.

శ్రీభగవానువాచ:—

కుతస్త్వా కశ్మల మిదం విషమే సముపస్థితమ్,
అనార్యజుష్ట మస్వర్గ్య మకీర్తికర మర్జున. ౨

శ్రీకృష్ణుడు పలుకుచున్నాడు:—

హే, అర్జునా! అకీర్తికరమును, నరకహేతువును, అనార్యులచే ఆచరింపబడ తగిన యీ మనోమాలిన్యము,యీ సంకటసమయమునం దెట్లు కలిగెను?

క్లైబ్యం మా స్మ గమః పార్థ నైతత్త్వయ్యుపపద్యతే,
క్షుద్రం హృదయదౌర్బల్యం త్యక్త్వోత్తిష్ఠ పరంతప. ३

హే, పార్థా! భయపడకుము. ఇది నీకు తగనిది. నీచమైన యీ మనోదౌర్బల్యమును విడనాడుము. హే, అరిమర్దనా! యుద్ధమునకు లెమ్ము.

## శ్రీ కృష్ణుని జవాబు

అర్జునుడు కృపచే అభిభూతుడుకాగా, [illegible]మతనిని మ్రింగివేయుటను శ్రీకృష్ణుడు జూచెను. కాన తామసికభారమును దొలగించుటకుగాను, అంతర్యామి యగు భగవానుడు తన ప్రియసఖునికి క్షత్రియోచిత తిరస్కారమును జూపజెచెను; అందుచే తామసికభావము తొలగి రాజసికభావము కలుగునని తలంచెను. శ్రీకృష్ణుడిట్లు చెప్పెను,—"చూడుమది నీ స్వపక్షమునకు సంకటకాలము. ఇపుడు నీవు వారిని విడనాడినచో, వారికి పూర్తిగా నాశము సంభవించును. రణక్షేత్రము నందు స్వపక్షమును విడనాడుట నీవంటి క్షత్రియశ్రేష్ఠుని మనస్సునందు కలుగకూడనిభావము. ఎచటనుండి నీకీదుర్బుద్ధి హఠాత్తుగా కలిగెను? ఈనీభావము దౌర్బల్య పూరితము, పాపభూయిష్ఠము. ఇది అనార్యులకుతగును; వారు దీనికి వశులగుదురు; ఆర్యులకిది అనుచితము: అందుచే పరలోక స్వర్గప్రాప్తికి విఘ్నమును, ఈ లోక యశః కీర్తులకు హానియు కలుగును." దీనితర్వాత శ్రీకృష్ణుడు అర్జునుని నింకను మర్మభేది వచనములచే మందలించెను. "ఈభావము క్లీబోచితము; నీవు వీరశ్రేష్ఠుడవు, విజయుడవు, కుంతీపుత్రుడవు. నీవును నిట్లు చెప్పతగునా? ఈదౌర్బల్యమును విడనాడుము, లెమ్ము, నీకర్తవ్యమును నెరవేర్చుటకు సాధించుము."

## కృప - దయ

కృప, దయ, యనిరెండును సర్వదా స్వతంత్ర భావములు. ఇంతేగాక కృప, దయకు విరోధభావమున

గూడ నుండగలదు. దయకు వశీభూతులమై మనము జగత్కల్యాణ మొనగూర్తుము: మనుష్యునియొక్కయు, జాతియొక్కయు, పరులయొక్కయు దుఃఖమును తొలగింతుము. కాని మనము స్వీయదుఃఖమునో, లేక యితర వ్యక్తి విశేషునిదుఃఖమునో సహించలేక, ఆకల్యాణ కార్యమునుండి మరలితిమేని, అది దయకాదు; కృపచే అభిభూతులమైతిమని అప్పుడు తలంచవలెను. దేశముయొక్కగాని మానవజాతియొక్కగాని దుఃఖవిమోచనకై కలుగుభావము దయ యనబడును. రక్తపాత భయముచే పుణ్యకార్యములనుండి తొలగి జాతియొక్కయు ప్రపంచముయొక్కయు దుఃఖమును చిరస్థాయిగా నుండుటకు సహాయులమైతిమేని, దానిని కృపాభావమని చెప్పవచ్చును. ఇతరులదుఃఖముచే దుఃఖించి, దానిని తొలగించుప్రవృత్తిని దయ యందుము; కాని యితరుల దుఃఖమునుచూచికాని, చింతించికాని, కాతరత నందుట కృప యనబడును. కాతరత, దయకాదు; అది కృప. దయ బలవంతుని ధర్మము. దయాస్వభావముచే బుద్ధుడు భార్యాపుత్రులను, తల్లిదండ్రులను బంధుమిత్రులను దుఃఖితులగావించి సర్వస్వము విడనాడి ప్రపంచ కల్యాణమునకై బయలుదేరెను. తీవ్రదయావేశముచే ఉన్మత్తయై, మహాకాళి ప్రపంచమునగల అసురులను సంహరించి, పృథ్విని రక్తపావితమొనరించి లోకులదుఃఖమును దూరమొనర్చును. కాని అర్జునుడు కృపావశుడై శస్త్ర పరిత్యాగమొనర్చెను.

ఈ భావమును అనార్యులు ప్రశంసింతురు; దీని ననుసరించి ఆచరింతురు. ఆర్యవిద్య దీనికన్న ఉదారమైనది, వీరోచితమైనది. ఇది దేవతల శిక్షణ. అనార్యుడు మోహమునందుపడి, అనుదారభావమును ధర్మమని తలంచి ఉదారభావమును పరిత్యజించును. అనార్యుడు రాజసికభావముచే అనుప్రాణితుడై తనయొక్కయు కుటుంబముయొక్కయు కులముయొక్కయు హితమును జూచునుగాని ప్రపంచహితమును గాంచడు. మఱియు, కృపావశుడై, ధర్మపరాఙ్ముఖుడై, తనను పుణ్యవంతునిగను, కఠోర వ్రతానుష్ఠానుడగు ఆర్యుని నిర్దయునిగను అధర్మపరాయణునిగను భావించి, తన్ను గుఱించి గర్వపడును. వీరు తామసికమోహముచే ముగ్ధులై అప్రవృత్తిని నివృత్తియందురు; సకామ పుణ్యప్రియతలను, ధర్మనీతియొక్క యుచ్చతమస్థానములను ప్రదానమొనర్తురు. దయ ఆర్యులభావము; కృప అనార్యుల భావము.

పురుషుడు దయచే వశీభూతుడై వీరునివలె నితరుల అమాంగళ్యదుఃఖములను నాశన మొనరించుటకు, అమంగళముతో యుద్ధముచేయ ప్రవృత్తుడగును. స్త్రీ దయచే వశీభూతయై యితరులదుఃఖము నుపశమింప చేయుటకు సేవాశుశ్రూష లొనర్చుటయందు తన సమస్త శక్తిని ఉపయోగించును. ఎవడు కృపావశుడై అస్త్రత్యాగ మొనర్చి ధర్మవిముఖుడై విలపించుటకు కూర్చొని, కర్తవ్య మొనరించుచుంటి ననియు పుణ్యవంతుడ నని

యము తలంచునో, వాడు నపుంసకుడు. ఈ భావము క్షుద్రము, బలహీనము. విషాద మెన్నడును ధర్మము కాజాలదు. విషాదమున కాశ్రయమిచ్చువాడు పాపమున కాశ్రయమిచ్చును. ఇట్టి చింతనామాలిన్యమును భావదౌర్బల్యమునువీడి యుద్ధమునకు సంసిద్ధుడై కర్తవ్యపాలనచే జగత్తును ధర్మమును రక్షించి, భూభారమును తగ్గించుటయే శ్రేయస్కరము. ఇదియే శ్రీకృష్ణుని మాటలలోని మర్మము.



అర్జున ఉవాచ:—

కథం భీష్మ మహం సంఖ్యే ద్రోణంచ మధుసూదన,
ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హా వరిసూదన. ౪

అర్జునుడు చెప్పెను:—

ఓ కృష్ణా! నే నెటుల భీష్మద్రోణాదులతో యుద్ధమున తలపడి పూజనీయులగు గురుజనులపై నెటుల అస్త్రప్రయోగ మొనర్తును?

గురూ నహత్వా హి మహానుభావాన్
శ్రేయో భోక్తుం భైక్ష్యమ పీహ లోకే,
హత్వార్థకామాంస్తు గురూ నిహైవ
భుంజీయ భోగాన్ రుధిరప్రదిగ్ధాన్. ౫

మహానుభావులైన గురుజనులను వధించుట కంటె, యీలోకమున బిచ్చమెత్తుకొనుటయే శ్రేయస్కరము. గురుజనులను వధించి ధర్మమోక్షములకు

తిలాంజలి యిచ్చుట, కేవల మీలోకమున రుధిరప్రదిగ్ధములైన అర్థకామము లనుభవించుటే గద.

న చైత ద్విద్మః కతర న్నో గరీయో
యద్వా జయేమ యది వా నో జయేయుః,
యానేవ హత్వా న జిజీవిషామః
తేఽవస్థితాః ప్రముఖే ధార్తరాష్ట్రాః. ౬

మన జయాపజయములకు హేతువెద్దియో? ఈ రెంటిలో యేది కోరతగినదో నేను తెలియజాల కున్నాను. ఎవరిని వధించిన పిమ్మట మనము జీవించుట కిచ్ఛగించమో అట్టివారు మనయెదుట నిలబడియున్నారు.

కార్పణ్యదోషోపహతస్వభావః
పృచ్ఛామి త్వాం ధర్మసమ్మూఢచేతాః
యచ్ఛ్రేయ స్స్యా న్నిశ్చితం బ్రూహి త న్మే
శిష్యస్తేఽహం శాధి మాం త్వాం ప్రపన్నమ్. ౭

దీనతాదోషముచేత నా క్షత్రియ స్వభావము నశించెను. ధర్మాధర్మము లెవ్వియో నాకు తోచకున్నవి. కాన నిన్ను అడుగుచున్నాను. నాకు శ్రేయోమార్గ మేదో నిశ్చయించి చెప్పుము. నేను నీకు శిష్యుడను. నీ శరణు పొందితిని. నాకు తెలియచెప్పుము.

న హి ప్రపశ్యామి మమాపనుద్యా
ద్యచ్ఛోక ముచ్ఛోషణ మింద్రియాణామ్
అవాప్య భూమావసపత్న మృద్ధం
రాజ్యం సురాణామపి చాధిపత్యమ్. ౮

ఈభూమియందు నిష్కంటకమై, సర్వసంపదల తో గూడిన రాజ్య మబ్బినను, లేక దేవేంద్రత్వము పొందినను, నా యింద్రియముల నన్నిటిని శోషింపచేయు చున్న శోకనివృత్త్యుపాయము నాకు కానరాకున్నది.

## అర్జునుడు శ్రేయోమార్గమును తెలుప వేడుట

శ్రీకృష్ణునిమాటలయం దుద్దేశ్యమును అర్జును డు గ్రహించెను; అందుచే, తాను రాజకీయవిపత్తును తొలగించుటకు విముఖుడనైయుంటినని అతనికి అర్థ మయ్యెను. కాని తన సందేహములకు తగినసమాధాన ము దొఱకనందున, శ్రీకృష్ణుని ఉపదేశమును బొందు టకు అతనికి శరణాపన్నుడయ్యెను. "నేను క్షత్రియుడ నైనను కృపావశమున నీమహాత్కార్యమునకు విముఖ మగుట నా నపుంకత్వసూచనయే. అది నా కపకీర్తికర ము, ధర్మవిరుద్ధము. కాని, నేనేమిచేయుదును? మనః ప్రాణములు ఒప్పుకొనకున్నవి. గురుహత్య మహాపాప మనియు, స్వీయసుఖముకొఱకు గురుజనులవధించుట అ ధర్మమగుననియు, ఈ కారణముచే ధర్మము మోక్షము పరలోకము, వాంఛనీయమగు మరితరమంతయు పోవు నని నామనస్సు చెప్పుచున్నది. వీనిచే కామనలు తృప్తి కావచ్చును, అర్థలాభముకూడ తృప్తిపొందనగును; కాని యివన్నియు ఎన్నిదినము లుండును. అధర్మముచే ప్రాప్తించినభోగము మృత్యువువఱకు మాత్రమే నిలు చును; దానితర్వాత అకథనీయ దుర్గతి కలుగును. ఒక

వేళ భోగించుట లభించినను, ఆభోగమున గురుజన రక్త స్వాదముండు కారణమున, ఎట్టి సుఖశాంతులు అందులో నుండగలవు? ఇంక ప్రాణమిట్లు చెప్పుచున్నది,— వీరు నా ప్రియజనులు, వీరిని హత్యగావించుటచే నీజన్మమునందు నాకేసుఖమును దొఱకదు; జీవించుటయే అయిష్టముగనున్నది. సమస్తసామ్రాజ్యభోగము కలిగినను స్వర్గమును జయించి, ఇంద్రుని ఐశ్వర్యమును భోగించినను నాకు సంతోషము కలుగదు. ఈ శోకము నన్ను పరాధీనునికావించి, కర్మేంద్రియములు జ్ఞానేంద్రియములను జయించి శిథిలమొనర్చి నన్నసమర్థునిగ నొనర్చినవి. ఇట్టిస్థితిలో నేనేమి అనుభవింతును? నాచంచల చిత్తమునందు హీనత ప్రవేశించినది; మహాక్షత్రియ స్వభావము ఈ నాదీనత్వమునందు మునిగిపోయినది. నేను నీశరణుజొచ్చుచున్నాను. నాకు జ్ఞానమునిమ్ము, శక్తినిమ్ము, శ్రద్ధనిమ్ము. మఱి నాకేది శ్రేయస్కరమో దానినిచూపించి నన్ను రక్షించుము.

సంపూర్ణరూపమున భగవంతునికి శరణాగతుడగుట గీతోక్తయోగమార్గ శిక్షణమైయున్నది. దీనిని ఆత్మసమర్పణ, లేక ఆత్మనివేదన యందురు. ఎవడు భగవంతుని గురువు ప్రభువు సఖుడు పథప్రదర్శకుడు యని తలంచి అన్యధర్మము లన్నింటికి తిలాంజలియిచ్చుటకు సిద్ధపడునో, పాపపుణ్యములు కర్తవ్యాకర్తవ్యములు, ధర్మాధర్మములు, సత్యాసత్యములు, మంగళామంగళములు, వీనిని విచారించక, తన జ్ఞానకర్మలను, సాధ

నయొక్క సమస్త భారమును శ్రీకృష్ణుని చేతియందిడునో, అతడే గీతోక్త యోగమున కధికారి. అర్జునుడు శ్రీకృష్ణునితో నిట్లు చెప్పెను,—"నీవు గురుహత్యయొనర్చుమని చెప్పినను, అది నాధర్మమని కర్తవ్యకర్మయని తెలియ చెప్పుము. దానినే నేను చేయుదును." ఈ గభీరశ్రద్ధా బలముచేతనే, అర్జునుడు సమకాలిక మహాపురుషు లందరిని అతిక్రమించి గీతోక్త శిక్షణకు శ్రేష్ఠపాత్రుడుగా గృహీతు డయ్యెను.

దీనికి సమాధానముగా శ్రీకృష్ణుడు మొట్టమొదటనే, ఈరెంటి అభ్యంతరములనుఖండించి, అనంతరము గురుభావము వహించి, జ్ఞానబోధ నొసంగుట కారంభించెను. ద్వితీయఅధ్యాయమునందు ౩౭-వశ్లోకమువఱకు అర్జునుని అభ్యంతరములు ఖండించబడెను; దానితర్వాతనే గీతాశిక్ష ఆరంభమయ్యెను. కాని, ఈ అభ్యంతరముల ఖండనయందు కొన్నిఅమూల్య బోధనలు గలవు; వానిని తెలిసికొననిది, గీతాశిక్ష హృదయంగమము కాదు. అందుచే కొన్నివచనములు విస్తారసహితముగా ఆలోచించ నావశ్యకత కలదు.

సంజయ ఉవాచ:—

ఏవముక్త్వా హృషీకేశం గుడాకేశః పరంతప,
న యోత్స్య ఇతి గోవింద ముక్త్వా తూష్ణీం బభూవహ. ౯

శత్రువులను తపింపజేయు అర్జునుడు శ్రీకృష్ణునితో అటుల చెప్పి నేను యుద్ధముచేయనని ఊరకుండెను.

తమువాచ హృషీకేశః ప్రహసన్నివ భారత,
సేనయో రుభయోర్మధ్యే విషీదంత మిదం వచః. ౧౦

రెండు సేనలమధ్య దుఃఖించుచున్న అర్జునుని జూచి శ్రీకృష్ణుడు నవ్వుచు నీ వాక్యమును బలికెను.

అశోచ్యా నన్వశోచ స్త్వం ప్రజ్ఞావాదాంశ్చ భాషసే,
గతానూ నగతానూంశ్చ నానుశోచంతి పండితాః. ౧౧

ఎవరికొరకు శోకించరాదో, నీవు వారికొరకు దుఃఖించుచు జ్ఞానివలె వేదాంతచర్చ చేయుచున్నావు. కాని జ్ఞాని చచ్చినవారలను గూర్చిగాని బ్రతికియున్న వారలను గూర్చిగాని దుఃఖించడు.

న త్వేవాహం జాతు నాసం న త్వం నేమే జనాధిపాః,
న చైవ న భవిష్యామ స్సర్వే వయ మతఃపరమ్. ౧౨

నేనును, నీవును, ఈ రాజులును, నిదివర కెప్పుడును లేకపోలేదు. ఇకముందును లేకపోవువారము కాము.

దేహినోఽస్మిన్ యథాదేహేకౌమారం యౌవనం జరా,
తథా దేహాంతరప్రాప్తి ర్ధీర స్తత్ర న ముహ్యతి. ౧౩

ఈ జీవునకు ఈ దేహమునందు బాల్యము, యౌవనము, ముసలితనము నెట్లో, మరియొక దేహమును పొందుటయు నట్లే. కాబట్టి యీ విషయమునందు పండితుడు మోహము నొందడు.

మాత్రాస్పర్శాస్తు కౌంతేయ శీతోష్ణసుఖదుఃఖదాః,
ఆగమాపాయినోఽనిత్యాస్తాం స్తితిక్షస్వ భారత. ౧౪

ఓ అర్జునా! ఇంద్రియములకు విషయసంయోగ

ముచే శీతోష్ణ సుఖదుఃఖములు కలుగుచున్నవి. ఆ సంయోగము లన్నియు అనిత్యములు, వచ్చుచు పోవుచుండును. నీవు వానిని ఓర్చుకొనుము.

యంహి న వ్యథయం త్యేతే పురుషం పురుషర్షభ,
సమదుఃఖసుఖం ధీరం సోఽమృతత్వాయ కల్పతే. ౧౫

ఏస్థిరబుద్ధికల పురుషుడు యీ సుఖదుఃములనన్నిటిని అనుభవించియు, దుఃఖమునొందక, ఆ సుఖదుఃఖములను సమభావమునగ్రహించునో వాడేమోక్షమునకర్హుడు.

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః,
ఉభయోరపి దృష్టోఽంత స్త్వనయో స్తత్వదర్శిభిః. ౧౬

అసత్తైన (లేని) యీ దేహమునకు సత్త (ఉండుట) లేదు. సత్తైన యాత్మ లేకపోవుట లేదు. తత్త్వవిదులు యీ రెంటియొక్క నిశ్చయమును దెలిసియుందురు.

అవినాశి తు తద్విద్ధి యేన సర్వ మిదం తతం,
వినాశ మవ్యయస్యాస్య న కశ్చిత్కర్తు మర్హతి. ౧౭

దేనిచే నీ సమస్తప్రపంచము వ్యాపింపబడినదో అట్టిఆత్మ నాశనములేనిది. దానిని ఎవరును నాశనము చేయజాలరు.

అన్తవన్త ఇమే దేహా నిత్యస్యోక్తా శ్శరీరిణః,
అనాశినోఽప్రమేయస్య తస్మాద్యుధ్యస్వ భారత. ౧౮

ఆత్మ నాశనము లేనిది, నిత్యమైనది. అది ధరించిన యీ దేహముమాత్రము నాశనముగలదని చెప్పబడినది. కాన ఓ అర్జునా! యుద్ధమొనర్చుము.

య ఏనం వేత్తి హంతారం యశ్చైనం మన్యతే హతం,
ఉభౌ తౌ న విజానీతో నాయం హంతి నహన్యతే. ౧౯

ఎవ డీయాత్మను వధించువానిగను, దేహనాశ నానంతరము ఆత్మ నాశనమగునట్లుగను దెలియుచున్నాడో వారిద్దరును తెలియనివారలే. ఈ ఆత్మ చంపదు, చంపబడదు.

నజాయతే మ్రియతేవా కదాచి
న్నాయం భూత్వా భవితావా న భూయః,
అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో
నహన్యతే హన్యమానే శరీరే. ౨౦

ఈ ఆత్మకు జన్మగాని, మృత్యువుగాని లేదు. ఒకప్పుడుండి మఱియొకప్పు డుండనిదికాదు. ఇది జన్మరహితమైనది. నిత్యమైనది. పురాతనమైనది. దేహము నశించగా నశించనిది.

వేదావినాశినం నిత్యం య ఏన మజ మవ్యయమ్,
కథం స పురుషః పార్థ కం ఘాతయతి హంతి కమ్. ౨౧

ఎవ డీయాత్మను నిత్యమైనదిగను, నాశనము లేనిదిగను, జన్మలేనిదిగను, అవ్యయమైనదిగను, ఎఱుగుచున్నాడో అట్టివాడు ఎవరిని వధించును? ఎవరిచే వధింపబడును?

వాసాంసి జీర్ణాని యథావిహాయ
నవాని గృహ్ణాతి నరోఽపరాణి,
తథా శరీరాణి విహాయ జీర్ణా
న్యన్యాని సంయాతి నవాని దేహీ. ౨౨

మానవు డేవిధమున చినిగిన వస్త్రములను వదలి నూతనవస్త్రములను ధరించునో, ఆవిధమున నే జీవి జీర్ణ దేహమును వీడి నూతన దేహము నాశ్రయించును.

నైనం ఛిన్దన్తి శస్త్రాణి నైనం దహతి పావకః,
నచైనం క్లేదయం త్యాపో నశోషయతి మారుతః. ౨౩

ఈ ఆత్మను ఆయుధములు నఱుకజాలవు. అగ్ని ద హింపజాలదు. నీళ్లు తడుపజాలవు. వాయువు ఎండింప జాల దు.

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయ మక్లేద్యోఽశోష్య ఏవచ,
నిత్య స్సర్వగత స్థాణు రచలోఽయం సనాతనః. ౨౪

ఈఆత్మ ఛేదించుటకును, దహించుటకును, తడుపుటకును, ఎండించుటకును అలవిగానిది. నాశనము లేనిది. స్థిరరూపమైనది. చలింపనిది. అనాదియైనది.

అవ్యక్తోఽయమచింత్యోఽయమవికార్యోఽయముచ్యతే,
తస్మాదేవం విదిత్వైనం నానుశోచితు మర్హసి. ౨౫

ఈఆత్మ వ్యక్తముగానిది, అచింత్యమైనది, వికారరహితమైనది. నీవు ఈవిధముగా తెలిసికొని శోకమును వీడుము.

అథ చైనం నిత్యజాతం నిత్యం వా మన్యసే మృతమ్,
తథాపి త్వం మహాబాహో నైవం శోచితు మర్హసి. ౨౬

అట్లుగాక ఈఆత్మకు జనన మరణములు కలవని తలంచినను, నీవు దీనిని గురించి దుఃఖించగూడదు.

జాతస్య హి ధ్రువో మృత్యుః ధ్రువం జన్మమృతస్యచ,
తస్మా దపరిహార్యేఽర్థే న త్వం శోచితు మర్హసి. ౨౭

ఎందువల్ల ననగా బుట్టినవానికి మరణము తప్పదు. చచ్చినవానికి జన్మము తప్పదు. కాబట్టి అనివార్యమయిన యీ విషయమునందు నీవు దుఃఖించుటచే నుపయోగము లేదు.

అవ్యక్తాదీని భూతాని వ్యక్తమధ్యాని భారత,
అవ్యక్తనిధనాన్యేవ తత్ర కా పరివేదనా. ౨౮

ఈ భూతములు మొదట తెలియరానివి. మధ్య తెలియబడుచున్నవి. తెదియబడని అంతముకలవి. ఈ స్వాభావికక్రమమును గుఱించి శోకించుట కెట్టి కారణమును గాన్పించకున్నది.

ఆశ్చర్యవ త్పశ్యతి కశ్చిదేన
మాశ్చర్యవ ద్వదతి తథైవచాన్యః.
ఆశ్చర్యవ చ్చైన మన్య శ్శృణోతి,
శ్రుత్వాప్యేనం వేద నచైవ కశ్చిత్. ౨౯

ఒకానొక డీయాత్మను ఆశ్చర్యవస్తువవలె జూచును. మరియొకడు దీనినిగూర్చి ఆశ్చర్యమువలెనే చెప్పును. మఱియొకడు ఆశ్చర్యముగా వినును. వినియు ఈఆత్మను నెవ్వడును నెఱుంగడు.

దేహీ నిత్య మవధ్యోఽయం దేహే సర్వస్య భారత,
తస్మా త్సర్వాణి భూతాని న త్వం శోచితు మర్హసి. ౩౦

ఈఆత్మ యెల్లపుడును యెల్లశరీరముల మధ్యను అవధ్యమైయుండును. కనుక యీ సమస్త జీవులనుగురించి నీవెన్నడును శోకించు టుచితముకాదు.

## మృత్యువు, అసత్యము

అర్జునుని మాటలివి; శ్రీకృష్ణుడు నగుమొగమును కనబఱచెను; ఆనవ్వు పరిహాసమయముగ నుండినను ప్రసన్నతాపూర్ణముగ నుండెను; అర్జునుని భ్రమయందు మానవజాతియొక్క ప్రాచీనభ్రమను గ్రహించి, అంతర్యామి నవ్వెను. ఆ భ్రమ శ్రీకృష్ణుని మాయచే ఉత్పన్నమైయుండెను. ప్రపంచమునందు అశుభ దుఃఖ దార్బల్యములను, భోగసంయమములద్వార క్షయమొందించుటకు, ఆయన, తన మాయాద్వారమున మనుష్యుని అభిభూతు నొనరించును. ప్రాణమునందు మమత, మరణమునందు భీతి సుఖదుఃఖాధీనత, ప్రియాప్రియముల గ్రహణ, అజ్ఞానము, మొదలగునవి అర్జునుని మాటయందు తెలియనగును. ఈ అజ్ఞానమును మనుష్యుడు బుద్ధిచే దూరముచేసి జగత్తును అశుభమునుండి ముక్తమొనరింప నావశ్యక ముండెను. ఈ శుభ కార్యమునకు అనుకూలావస్థ నేర్పఱచుటకును, గీతను బోధించుటకును, శ్రీకృష్ణు డవతరించెను. కాని మొదలు అర్జుననికి మనస్సునందు కలిగినభ్రమను భోగింపజేసి క్షయింపజేయుటావశ్యకము. అర్జునుడు శ్రీకృష్ణుని సఖుడు, మానవజాతి ప్రతినిధి. అతనికి గీత వినిపింపబడెను. అందులకతడు అర్హుడు. కాని, మానవజాతి నేటివఱకు కూడ గీతార్థమును గ్రహించుటకు యోగ్యతను పొందజాలకున్నది. అర్జునుడును సంపూర్ణముగా గీతను గ్రహించుటకు సమర్థుడైయుండలేదు. అతని మనస్సునందు పుట్టిన శోకదుఃఖకాతరముల, పూర్ణముగ కలియుగారం

భము నుండియు మానవజాతి అనుభవించుచున్నది. క్రైస్తవమతము ప్రేమను, బౌద్ధమతము దయను, ఇస్లామ్‌మతము శక్తినికలిగించి, ఈదుఃఖమును తగ్గించుటకు నేర్పడియున్నవి. ఇప్పుడు కలియుగాంతర్గత సత్యయుగ ప్రథమభాగము ఆరంభమగుచున్నది. భగవంతుడు భారతజాతికి గీతను ప్రదానమొనరించియున్నాడు; దానిని మనము ధారణచేయుటలో సమర్థుల మైతిమేని, అందుచే భారతదేశమునకును జగత్తుకును మంగళమగుట సునిశ్చితము.

శ్రీకృష్ణుడిట్లు చెప్పెను,—"అర్జునా, నీవు పండితునివలె పాప పుణ్యములను గూర్చియు జననమరణతత్త్వమునుగూర్చియు చర్చించుచు, జాతియొక్క శుభాశుభములు ఎట్లు కలుగునదియు ప్రతిపాదింప తలంచియున్నావు. కాని నీవాక్యములందు వాస్తవిక జ్ఞానపరిచయము దొరకకున్నది; పైగా నీ ప్రతిమాటయందును ఘోర-అజ్ఞాన మిమిడియున్నది. "నా హృదయము దుర్బలమైనది; శోకముచే కాతరతపొందినది; నాబుద్ధి కర్తవ్యమునుండి విముఖమైనది" అని స్పష్టముగా చెప్పకూడదా? జ్ఞానియొక్క భాష నుపయోగించి అజ్ఞానమును తర్కించి నీదౌర్బల్యమును సమర్థించుకొనజూచినను ప్రయోజనమేదియు నుండదు. శోకము మనుష్యమాత్రుని హృదయమునందు ఉత్పన్నమగును; మనుష్యమాత్రునికే మరణ విచ్ఛేదములు అత్యంత భయంకరముగ నుండును; అతనికే, జీవనము అత్యంతమూల్య

మగుచున్నది, శోకము అసహ్యమగుచున్నది; కర్తవ్య మొక కఠోర వస్తువగుచున్నది; మనుష్యమాత్రుడే, స్వార్థసిద్ధిని మధురమని తలంచి హర్షించును; దుఃఖించును, నవ్వును, ఏడ్చును. కాని, ఈవృత్తు లేవియు జ్ఞానసూత్రములు కావు. ఎవనికొఱకు శోకించుట అనుచితమో, అతనికొఱకు నీవు శోకించుచున్నావు. జ్ఞాని ఎవనికొఱకుకూడ శోకమునుపొందడు. మృతవ్యక్తిని గురించియు నంతే; జీవితవ్యక్తినిగురించియు నంతే. మృత్యువులేదనియు, విచ్ఛేదములేదనియు, దుఃఖము లేదనియు, తాను అమరుడననియు, సదా, ఏకుడను, ఆనందుని సంతానమును, అమృతునిసంతానమును, ఈ పృథ్విపై జీవనమరణములతో దాగుడుమూత లాడుటకు వచ్చియున్నానని అతడు తలంచును. పృథ్వి, యొక విశాలరంగ మంచము; దానిపై మానవుడు నవ్వుచు, నేడ్చుచు అభినయమొనర్చుచుండును. శత్రుమిత్రరూపమున యుద్ధశాంతిప్రేమ కలహముల రసాస్వాదనము చేయుచుండును. ఇక్కడ కొంతకాలముండి, రేపోమాపో దేహమును విడిచి ఎక్కడికిపోవునో అతనికి తెలియదు. ఇది నా అనంత క్రీడయొక్క ఒక ముహూర్తమాత్రము; క్షణికఖేల; కొద్ది నిమిషములస్థితి, నేనుంటిని, నేనున్నాను, నేనుందును; నేను సనాతనుడను, నిత్యుడను, అవినాశిని. నేను ప్రకృతియొక్క ఈశ్వరుడను, జీవన-భరణ కర్తను; భగవానుని అంశుడను, భూతభవిష్యద్వర్తమానముల స్వామిని. శరీరమునకు బాల్యయువ వృద్ధా

వస్థలగునట్లుగా, దేహాంతరప్రాప్తియు జరుగును; మరణము నామమాత్రము; దీనిపేరును విన్నంతనే మానవుడు భయపడుచుండును, దుఃఖించుచుండును; కాని సరిగా అర్థము తెలిసికొన్నచో భయదుఃఖములు కలుగవు. ఎవ్వడైన బాలకుడు యువకు డయ్యెనేని, ఆ యువకునిచూచి బాలకుడు మృతి చెందెనని ఏడ్చుచు, ఆహా నాప్రియబాలకు డెక్కడపోయినాడు, యీయువకుడు బాలకుడు కాడు, నాముద్దుబిడ్డ డెక్కడ యున్నాడు, అన్నచో, నిట్టి వ్యవహారము నందఱు హాస్యాస్పదముగా భావించి, ఘోర-అజ్ఞాన ప్రసూతమని చెప్పుదురు. ఇట్టి అవస్థాంతరప్రాప్తి ప్రకృతి నియమము. బాలకుని దేహమునకు యువకుని దేహమునకు ఒకేపురుషుడు, బాహ్యపరివర్తన కతీతుడై, స్థిరభావమున విరాజమానుండై గలడు. సాధారణ మనుష్యునికి మృత్యు కారణముచే కలుగు భయదుఃఖములు జ్ఞానపురుషుడుచూచి పై వ్యవహారమువంటిదే యిదియని, హాస్యాస్పదమని, అజ్ఞానజనితమని తలంచును; ఏలయన దేహాంతరప్రాప్తి ప్రకృతి నియమమనియు స్థూల సూక్ష్మదేహములందు ఒకే పురుషుడు బాహ్యపరివర్తన కతీతుడై స్థిరభావముచే విరాజమాను డగుచుండునని అతనికి తెలియును. మనము అమృతుని సంతానులము, చచ్చునదెవ్వరు, చంపునదెవ్వరు? మృత్యువు మనల స్పర్శించలేదు; అదియొక నిరర్థక శబ్దము, అదియొక భ్రమ, మృత్యునామముగల వస్తు వెద్దియులేదు.

# మాత్రిలు

పురుషుడు అమరుడు; ప్రకృతి సచలము. సకల ప్రికృతియందు అచలపురుషుడు అవస్థితుడైయున్నాడు. ప్రికృతిస్థ పురుషుడు పంచేంద్రియములద్వారమున, చూచును, వినును, అఘ్రాణించును, ఆస్వాదించును, స్పృశించును. వీనిని భోగించుటకు ప్రికృతి యీయింద్రియముల సాహాయ్యమును గొనును. మనము రూపమును దర్శింతుము; శబ్దమును విందుము; గంధము నాఘ్రాణింతుము; రసమును ఆస్వాదింతుము; స్పర్శను అనుభవింతుము. శబ్దస్పర్శ రూప రసగంధములగు నీయైదు తన్మాత్రిలును నింద్రియభోగ విషయములు. ఆరవ యింద్రియమగు మనస్సుయొక్క విశేషము, విషయ సంస్కారము. బుద్ధియొక్క విషయము చింతన. పంచ తన్మాత్రలు, సంస్కారము, చింతనము, వీనియొక్క భోగానుభవముల కొఱకే పురుషప్రికృతుల పారస్పరిక సంభోగములును అనంతక్రీడయు నగుచున్నవి. ఈ భోగము రెండు విధములు. శుద్ధము, అశుద్ధము. శుద్ధభోగమునందు సుఖదుఃఖము లుండవు; ఇందులో పురుషుని చిరంతన స్వభావసిద్ధధర్మ మేఆనందమునుకూడి యున్నదో, అట్టి ఆనందమే యుండును. అశుద్ధ భోగమునందు, సుఖదుఃఖములు, శీతోష్ణములు, ఆకలిదప్పులు, హర్షశోకములు యిత్యాది ద్వంద్వము లుండును; ఇవి, అశుద్ధ భోగులను విచలన విక్షోభముల గావించును. కామము, అశుద్ధతయొక్క కారణము; కామియు అశుద్ధుడు; నిష్కామియే శుద్ధుడు. కామముచే రాగద్వేషములు

జనించును; రాగద్వేషములకు వశుడై పురుషుడు విషయాసక్తుడగును; ఆసక్తియొక్క ఫలమే బంధము. మానవు డెట్టికష్టము లనుభవించుచున్నను, ఆసక్తియొక్క అభ్యాసకారణముచే, వాని క్షోభవ్యథలను విడువ నసమర్థుడుగ నుండును; అంతవఱకు అతనియందున్న పురుషుడును, విచలితుడు విక్షుబ్ధుడు.

సప్తభావము

శ్రీకృష్ణుడు మొదలు ఆత్మనిత్యత్వమును బోధించి, తర్వాత అజ్ఞానబంధన నిర్మూలనమునకు తగిన ఉపాయము చూపించెను. మాత్రలన సుఖదుఃఖాది ద్వంద్వములకు కారణమగు విషయములయొక్క నానారూపస్పర్శాదులు; ఈస్పర్శ లనిత్యములు; వీని కాద్యంతములు కలవు; అట్లని తెలిసి వీనియందుగల ఆసక్తిని త్యజించవలెను. అనిత్యవస్తువులం దాసక్తి కలిగినప్పుడు, వాని ఆగమనముచే సంతోషము, వాని నిర్గమనముచే దుఃఖము కలుగును. ఈఅవస్థనే అజ్ఞానమందుము. అజ్ఞానముద్వారా, అనశ్వర-ఆత్మయొక్క సనాతనభావము యథార్థానందము ఆచ్ఛాదితమై కేవల క్షణభంగురభావముల కూర్చెడు వస్తువులచే మత్తులమై, వానినాశముచే దుఃఖమునుపొంది శోకసాగరమున మునిగిపోదుము. ఎవ్వడు, ఈవిధముగ నభిభూతుడు కాక విషయస్పర్శలను ననుభవించగలుగునో, ద్వంద్వముల ప్రాప్తి కలిగినను సుఖదుఃఖములు శీతోష్ణములు ప్రియాప్రియములు మంగళామంగళములు సిద్ధి: అసిద్ధి నగు వీనిచే

హర్షశోకాదుల పొందకుండునో, సమభావనచే ప్రఫుల్లతా చింతనచే స్థితుడై గ్రహించగలడో, అట్టి పురుషుడు రాగద్వేషములచే విముక్తుడై, అజ్ఞానబంధముల త్రెంచి, సనాతనభావమును ఆనందమును ఉపలబ్ధి పొందుటకు సమర్థుడగును,—అమృతత్వాయ కల్పతే.

## సమతయొక్క విశేషత

ఈ సమత్వమే గీతయొక్క ప్రథమశిక్ష. సమతయే గీతోక్తసాధనకు ఆధారభూతము. గ్రీకుదేశపు స్టూయిక్ (Stoic) సంప్రదాయము, భారతమునుండి ఈ సమతా బోధను గ్రహించి, ఐరోపాఖండమున సమతావాద ప్రచారము గావించెను. గ్రీకుల దార్శనికుడు "ఎపిక్యూరియస్" శ్రీకృష్ణునిచే బోధింపబడిన యీ శిక్షణయొక్క ఒక్కభాగమును మాత్రమే గ్రహించి, భోగవాద (Hedonism) మును లేక శాంతభోగ మనెడి శిక్షణను ప్రచారమొనర్చెను. ఈ రెండువాదములును ప్రాచీన ఐరోపాఖండమందు శ్రేష్ఠనైతిక మతములుగా భావింపబడెడివి. ఆధునిక ఐరోపాయందును, ఈరెండును నూతనాకారమును దాల్చి పవిత్రతా వాదము (Puritanism) మూర్తిపూజావాదము (Paganism) లుగ మారి, చిరద్వంద్వములుగ నేర్పడెను. కాని గీతోక్తసాధనయందు సమతావాదము, శాంతిలేక, విశుద్ధభోగవాదము, ఈ రెండును నొకటే. సమత్వము కారణము, విశుద్ధభోగము కార్యము. సమత్వముచే ఆసక్తి నశించును; రాగద్వేషములు ప్రశమితమగును;

ఆసక్తి నాశమై, రాగద్వేషములు ప్రశమితమగుటచే, విశుద్ధత యుత్పన్నమగును. విశుద్ధపురుషుని భోగము కామనాసక్త రహితముగా నుండును; అందుచే నది శుద్ధము. ఆసక్తియు, రాగద్వేషములును, ఒకే ఆధారమునందు సమత్వముతో కూడియుండజాలవు; ఇదియే సమత్వము నందలి విశేషము. సమత్వమే విశుద్ధతకు బీజము.

## దుఃఖ జయము

గ్రీకు స్టోయిక సాంప్రదాయములు దుఃఖమును జయించుటకు సరియగు నుపాయమును గ్రహించజాలక పోయిరనుట వారియందది యొకలోపము. వారు దుఃఖమును నిగ్రహించి, అణచియుంచి దానినిజయించ ప్రయత్నించిరి. కాని గీతలో నిట్లు చెప్పబడెను,—

"ప్రకృతిం యాంతి భూతాని నిగ్రహం కిం కరిష్యతి"

"భూతము లన్నియు తమతమ ప్రకృతిని అనుసరించుచున్నవి; నిగ్రహామువలన లాభమేమి?" దుఃఖమును నిగ్రహించుటచే మనుజుని హృదయము శుష్కమై కఠోరమై ప్రేమశూన్యమైపోవును. దుఃఖమువల్ల కంట నీరు కారకపోవచ్చును; కష్టానుభవములు తనవని యొప్పుకొనకపోవచ్చును; "ఇదేమియులేదు" అనిచెప్పి మౌనముగా సహించవచ్చును; భార్యాపుత్రుల దుఃఖమును, బంధుజనులయు సంఘముయొక్కయు దుఃఖమును, అవిచలిత చిత్తముచే చూడవచ్చును; కాని, ఈ భావము బలగర్విత–అసురుని తపస్వభావము, మహత్త్వము; మనుజుని ఉన్నతికిగాను వీని యావశ్యకతయు

అవసరక్షే; కాని యీ విధానము దుఃఖమును జయించు వాస్తవిక ఉపాయముకాదు; ఇది అంతిమ లేక చరమ శిక్షణ కాదు. దుఃఖమును జయించు వాస్తవిక ఉపాయము, జ్ఞాన శాంతి సమతలు. శాంతభావముచే సుఖ దుఃఖ సంచారమును అణచకూడదు; కాని బుద్ధిని అవిచలితముగ నుంచవలెను; సమతయొక్క స్థానము బుద్ధి, చిత్తముకాదు ప్రాణముకాదు. బుద్ధి సమత్వమును పొందినంతనే, చిత్తప్రాణములు తమంతట యవి సమత నొందును. ఐనను ప్రేమాది ప్రకృతిజాత ప్రవృత్తు లుడిగిపోవు. మనుజుడు పాషాణముకాని, జడముకాని, నిర్జీవ వస్తువుకాని, కాజాలడు. "ప్రకృతిం యాంతి భూతాని". ప్రేమ యిత్యాది ప్రవృత్తులు ప్రకృతియొక్క చిరంతన ప్రవృత్తులు; వానినుండి పరిత్రాణము పొందుటకు గల ఏకమాత్రఉపాయము, పరబ్రహ్మమునందు లీనమగుటయే. ప్రకృతియందుండి, ప్రకృతిని త్యజించుట అసంభవము. కోమలత్వమును వీడిన, కఠినత్వము హృదయము నాక్రమించును. బాహ్యమునుండి దుఃఖ స్పందనను సమీపించకుండ చేసినచో, లోన దుఃఖము జమయగును. మఱియు నది అలక్షితరూపమున ప్రాణమును శుష్కింపజేయును. ఇట్టి కఠోర సాధనముచే నున్నతి పొందుట సాధ్యముకాదు. ఇట్టి తపస్సుచే శక్తి కలుగును. కాని ఈజన్మమున దేనిని అణచియుంతుమో, అది తర్వాతిజన్మమున అవరోధము లన్నింటిని త్రోసివేసి ద్విగుణీకృత వేగమున బయలుదేఱును.

# గీ తా భూ మి క

## చతుర్థకల్పము

### గీతతో మనకుగల ఆవశ్యకత, దానినుండి మనము కోరునది

ప్రపంచమునందు పవిత్రాపవిత్రములైనట్టియు, కొలదిగనో గొప్పగనో దివ్యసందేశము నిచ్చునట్టియు, వివిధ ధర్మములను వివిధదార్శనిక సిద్ధాంతములను వేర్వేఱు సాంప్రదాయములను విధానములను తెలుపునట్టియు, అనేక మతగ్రంథములు గలవు. ఈ గ్రంథములను అజ్ఞానులును, కొంతకుకొంత జ్ఞానము కలవారును చదివి, అందులో నొకదానిని స్వీకరించి, యితరములను విసర్జించి, తాము స్వీకరించిన మతగ్రంథమే దివ్యోపదేశమనియు, నితరము లర్ధసత్యములో లేక అసత్యములో అనియు, తాము స్వీకరించిన దార్శనిక సిద్ధాంతమే సహేతుకమైనదనియు, తదితరములు దోష భూయిష్ఠములనియు చెప్పుచుందురు. భౌతికవిజ్ఞానశాస్త్ర పరిశోధ నలను కూడ నొక మతధర్మముగా కొందఱు తలంచుచూ, దాని కొక యున్నతస్థానమునిచ్చి, ఆస్తిక్యతాధ్యాత్మికతలనునవి అజ్ఞా నము లనియు మూఢవిశ్వాసములనియు, దార్శనిక సిద్ధాంతమొక మిథ్యాకల్పన యనియు వీనిని త్రోసిపుచ్చుచున్నారు. కొన్ని సమయములలో అహంకార పూరితులగు వివేకవంతులుకూడ నిట్టి వారల అభిప్రాయములతో నేకీభవించుచున్నారు. అయ్యును మనము ప్రస్తుతము కొంతవఱకిట్టి మూఢాభిప్రాయములను వదలి, సహనము కలిగియుండుట నేర్చుకొన్నాము; మన మిప్పుడు

పూర్వులవలె దేవుని పేరుతో మతము పేరుతో తోడిమానవులను వారికిగల భేదాభిప్రాయములను గుఱించి వధించుటలేదు. పూర్వుల వలె వారిని దూషించుటకాని శపించుటకాని లేదు. సత్య మంతట కూడ నున్నదని కొంతవఱ కంగీకరించుచున్నాము. ఇతర మత దార్శనిక సిద్ధాంతములను, వానియందుగల దోషములను తెలిసికొనుటకుగా గాక, వానిలోని సత్యమును సాహాయ్యకాంశములను తెలిసికొనగోరుటకు పఠించుచున్నాము. కాని మన మతగ్రంథము పూర్ణసత్యమును కలిగియున్నదనియు, నితరములు అర్ధసత్యమునే కలిగియున్నవనియు, మనధర్మము పూర్ణాధికారము గలవారికనియు, నితరములు అర్ధాధికారము కలవారికనియు తలంచుట మన మింకను మానలేదు; ఈ కారణముచేతనే మనకు సమ్మతమైన ధర్మమును, నితరులపైనను మనపైనను కూడ బలాత్కారముగ పూర్ణసత్యమని నారోపించుకొను స్వభావమునుండి మనమింకను విముక్తి కాంచలేదు.

అందుచే ప్రాచీనగ్రంథములగు వేదములు ఉపషత్తులు గీత, యను వానిని గుఱించి మనము విచారించబోవునపుడు, మన మైత్రిభావముతో ఆ కార్యమును చేయుచున్నది, మానవజాతి యొక్క భవిష్యత్తుకవి యెంత ప్రయోజనమని మనము తలంచునది, మనము స్పష్టముగా సూచించుట ఆవశ్యకమై యుండవచ్చును. ఇందుకు మన మంగీకరించవలసిన ముఖ్యాంశమొకటి మొదటిది కలదు; మన మన్వేషించు సత్యము, యేకము శాశ్వతము, అనునది యే ఆది; దీనినుండియే మిగతసత్యములన్నియు బహిర్గతము లగుచున్నవి; దీని ప్రకాశము నుండియే మిగతవన్నియు, జ్ఞానవిధానమునందు వానివానికిగల యుచితస్థానముల నవి అలంకరించును.

కాని సత్యము, యేకము సనాతనమునైన కారణముగ, అది యేయొక్కసూత్రమునందును బంధింపబడజాలదు; అది యేయొక్క

దార్శనికసిద్ధాంతమునందుకాని, మతగ్రంథమునందుకాని దాని పూర్ణస్వరూపమున కనుగొనబడజాలదు. అది యేయొక్క ప్రబోధకుడు, చింతకుడు, ప్రవక్త, అవతారపురుషునిచేతకూడ పూర్ణముగ వచింపబడజాలదు. మేము స్వకీయసత్యమిదియని వచించు నప్పుడు, నితరవిధానములందు సత్యములేదని మే మెంతమాత్రము నుడువుటలేదు. ఏలయన మేము వేరొకదానిని ఉద్రేకముతో నిరాకరించినను, దానిని మేము వివరించలేమనియు, అర్థము చేసికొనలేమనియు, మా నిరాకరణను తలంచవలయును. ఇంక రెండవ విషయ మేమన, ఈసత్యము యేకము సనాతనము అయ్యును అది దేశకాలములందు మానవుని మనస్సుద్వారమున ప్రకటించుకొనుటచే ప్రతి మతగ్రంథము రెండుఅంశములను కలిగియుండవలెను. మొదటిఅంశము, తాత్కాలికమై నశ్వరమై, ఆసత్యము వచింపబడిన ఆయాదేశములకు సంబంధించిన భావములతో కూడినదై యుండును. రెండవ అంశము, శాశ్వతమై అనశ్వరమై సర్వకాల సర్వదేశములకు అన్వయించునదై యుండును. అదియునుగాక, సత్యమును వచించుటలో ప్రారంభమున దానికివ్వబడిన రూపము, విధానము, వ్యవస్థ, దాని దార్శనిక బౌద్ధికనిర్మితి, దాని స్పష్ట వ్యక్తీకరణము, యివియన్నియు కాలానుగుణ్యముగా మార్పునకులోనై ప్రారంభమున దానికుండిన శక్తిని అర్థమును కోల్పోయి యుండును. ఏలయన మానవునిబుద్ధి సదా తన్నుదా మార్పు కావించుకొనుచుండును. మాటిమాటికి విషయములను సంశ్లేష విశ్లేషము చేయుచుచేయుచు, పరిచ్ఛిన్నభాగములను వేర్పఱచి, వానిని మఱల సంయోగించుచుండును. అందుచే అది సర్వదా పూర్వ సంకేతములను వ్యక్తపఱచునట్టి పూర్వవిధానమును మార్పు కావించును. లేదా పూర్వశబ్దములనే వినియోగించి కాని, అర్థమునైన మార్పుగావించును; ఈ కారణమున పూర్వగ్రంథమును, ఆ

కాలపు ప్రజలు చింతకులు చేసికొన్న అర్థమును, మనము గ్రహించజాలక పోవుదుము. అందుచే నిట్టి గ్రంథములయందు, మనకు శాశ్వతవిలువను గలిగియుండగల అంశమేమన, అందులోనున్న సత్యము విశ్వగతమైనదిగ నుండుటమాత్రమే గాక, బౌద్ధికదృష్టి కన్న యున్నతమైన దృష్టికి గోచరింపబడగలిగి, మానవునిచే అనుభవింపబడగలిగి, జీవింపబడగలిగిన దేదియో అదియే.

అందుచే గీతయందు తత్త్వసంబంధమైన అర్థమును, అప్పటి ప్రజలు తలంచిన విధమున తెలిసికొనుటకు ఒకవేళ సాధ్యమైనను, అది అవసరమనిమాత్రము నేను తలంచను. అది సాధ్యము కాదని, దానినిగురించి వ్రాయుభాష్యకారుల భేదాభిప్రాయములే తెలుపుచున్నవి. ఒక్కొక్కరును ప్రతి యితరునితో భేదించి తమ స్వకీయ తత్త్వసిద్ధాంతమునే, తమ మతధర్మమునే గీతబోధించుచున్నదని వచించుచున్నారు. హిందూదర్శన సిద్ధాంతములు చారిత్రికముగా వృద్ధికాంచిన విధానమును తెలుపు తేజశ్శీలుర వివేచనముకాని, స్వార్థరహిత పాండిత్యముకాని గీతలోని తత్త్వ సిద్ధాంతమును నికరముగా తెల్పలేదు. గీతయందుగల తత్త్వవిషయములువినా, అందుగల సజీవసత్యములు ప్రపంచమున కెంత ప్రయోజనకారియైనదియు, ప్రస్తుత మానవజాతియొక్క ఆధ్యాత్మిక అవసరములకు సాహాయ్యకముగ మనము వానిని సహజరూపమున శక్తిపూరితముగ నెట్లు వచించవలసినదియు, వీనిని మాత్రమే గీతనుండి మనము వెతకి యిప్పుడు చేయవలసిన పని, ఈ ప్రయత్నమునందు మన వ్యక్తిగత స్వభావముతో కూడిన దోషములను, ప్రస్తుతకాలపు భావములను, కలుపుటయు సహజమే. మనకంటె గొప్పవారు మనకు పూర్వము అట్లే చేసియుండిరి. కాని, ఈ గీతాభావమునందు మనము మునిగియుండినగాని, లేక ముఖ్యముగ దాని సత్యమునందు మనము జీవించ ప్రయత్నించియుండిన

గాని, మనము వ్యక్తిగతముగా మన శక్తికొలది దానినుండి పొంద నుద్దేశించిన సత్యమును గనుగొనగలమనుట నిజము. మత గ్రంథ ములు వ్రాయబడినది నిజములో అందులకే; మిగత దంతయు వాగ్వాదమే, పండిత ప్రకర్షే. ఏ మతగ్రంథములు, ఏ దర్శన సిద్ధాంతములు, ఈ విధముగ మఱల మఱల అభ్యుదయ మానవ జాతియొక్క అంతరంగిక చింతనయందును, ఆధ్యాత్మిక అనుభవము నందును నూతనము కావించబడి, జీవించబడి, నూతనరూపము నొసంగబడునో, అవియే మానవజాతికి ప్రయోజనకరముగను, ముఖ్యముగను నుండగలవు. మిగతవి గతకాల సంభవములను సూచించు స్మారకచిహ్నములుగమాత్రమే నిలిచి, భవిష్యత్తుకు శక్తి నొసంగజాలకుండును.

గీతయందు స్థానికము ఐహికము మాత్రమేయైన విషయము చాల కొంచెము. గీతాభావము మహావిశాలము, గంభీరము, విశ్వా త్మకము నగుటచే, ఆ కొంచెమునుకూడ దాని ఉపదేశము చెడ కుండ విశ్వాత్మకము గావించవచ్చును. ఆ దేశమునకు, ఆ కాల మునకు సంబంధించినదానిని విశాలమొనర్చుటచే, ఆ ప్రబోధము మరింత అగాధతరమై సత్యతరమై శక్తిమంతమై నిలుచుచున్నది. చాలసార్లు గీతయందుగల నిట్టి స్థానికపరిమితభావము ఈ విధముగ విస్తృతి కాంచినది. ఉదాహరణముగ, పూర్వపు భారతీయ యజ్ఞ విధానము దేవతలకును మనుజులకును మధ్యజరుగు పరస్పరాను గమనము అనుట భారతదేశమునందు చాలకాలముగ లుప్తమైనది. మానవునిమనస్సు దీనినిప్పుడు సత్యమని తలంచుటలేదు. కాని "యజ్ఞము, దేవతలు" అను పదములకు గీతయందు గల అర్థము సాంకేతికమనియు, ఔపమిక మనియు తలంచి, అవి కేవలము స్థానికము పౌరాణికమని మాత్రమేగాక, వానిని విశ్వాత్మక మొనర్చి తత్త్వశాస్త్రమును వానికి అనుసరింప చేసినచో, అవి

మానసిక శాస్త్రమందలి కార్యకారాంశమునకు, ప్రకృతియొక్క సామాన్యధర్మమునకు అన్వయమగునని మనము తెలిసికొనవచ్చును. అందుచే, ఆ యజ్ఞభావమును ప్రాణులకు ప్రాణులకుమధ్య జరుగు నిచ్చిపుచ్చుకొనుటలుగను, నైతికముగ కావించు ఆత్మార్పణముగను, ఆధునికులరీత్యా భావించి దానికి గంభీరయున్నత ఆధ్యాత్మికసత్యమును ఆపాదించి విశాలము కావించవచ్చును. వీనివలెనే శాస్త్రమునననుసరించిన కర్మవిధానము చాతుర్వర్ణ విధానము, వాని కొసంగబడిన వేర్వేఱుస్థానములు, మరియు శూద్రులకును స్త్రీలకును ఆధ్యాత్మికముగా నొసంగబడిన తగ్గుస్థితి యివన్నియు ఐహికము స్థానికము నగు విషయములుగా తోచును. వీని పదపదార్థమును బట్టి పరీక్షించినచో, అవి ఆధ్యాత్మికతను విశ్వాత్మకతను లేనివిగను, మానవజాతి కంతటికిని అన్వయించని విషయములుగను తోచును. కాని వీనిలోని ఐహిక స్థానిక విషయములను వదలి వీనికి వెనుకగల భావమును పరికించినచో నిక్కడ కూడ దానిభావము గంభీరమై సత్యమై తాత్త్వికము, ఆధ్యాత్మికము, విశ్వాత్మకము నగు రూపమును దాల్చును. గీతాభావము ననుసరించి శాస్త్రమనగా, మానవజాతి తనపైన అజియే తన ఆశిష్ట-అహంకారపూరిత కార్యమునకు బదులు, తన జీవితసుఖములను తృప్తిపఱచుకొనుటలో నియమించుకొను యొకయున్నత జీవితవిధానము,ఉద్దేశ్యము. అట్లే చాతుర్వర్ణ విధానముకూడ నొక ఆధ్యాత్మిక సత్యముయొక్క క్రియాస్వరూపము. ఈ సత్యము ఆ రూపముచే బాధింపబడదు. అది వ్యక్తియొక్క ఆంతరంగిక స్వభావము ననుసరించి అతడవలంబించు ఋజువర్తన, సత్యాచరణ. గీతలోని స్థానిక ప్రత్యేక విషయములనుగూడ, నది ఇట్టిభావము వచించుటచేత మనము వానికట్టి అర్థమును కలిగించుటకూడ న్యాయమే. ఏలయన దాని గంభీరతమ సత్యము దాని భాషయందు

ప్రత్యేకముగా వచింపబడకున్నను, దాని చింతనయందది యిమిడి యున్నది.

అట్లే గీతలోని మత విషయములందును అది అప్పటిలో వాడుకయందున్న పారిభాషిక పదములను మత సాంకేతిక పదములను ఉపయోగించినది. వానినిగుఱించికూడ మన మిదేసూత్రము ననుసరించి వ్యాఖ్యానింతుము. గీత, సాంఖ్యమును యోగమును గుఱించి చెప్పినపుడు మన కవసరమైన విషయములనే గ్రహించి, గీతాసాంఖ్యము ఒక్క పురుషునిమాత్రమే వచించినందున దానినే అంగీకరింతుము. అనేక పురుషులను ఒక్క ప్రకృతిని వచించు సాంఖ్యకారిక మత విషయమును త్రోసిపుత్తము. అట్లే గీతయందు చెప్పబడిన, నానాంశకము సూక్ష్మము సమృద్ధము రమ్యమునైన యోగవిధానమును అంగీకరింతుము. కాని ఈశ్వరవాదమును,సృష్టి యొక్క స్పష్ట క్రమవిధానమునుగల పతంజలిశాస్త్రము వచించు యోగవిధానమును గీతాయోగముతో మిశ్రమమొనరించము. గీతలోని సాంఖ్యము, యోగము రెండును ఒకే వేదాంతసత్యము యొక్క చీలికలు, లేక ఆ సత్యానుభవమును పొందుటకు యుగపదముగా వర్తించు ఒకేమార్గము. ఒకటి తత్త్వమును బుద్ధిని విశ్లేష విధానమును అవలంబించును, మఱియొకటి స్వతఃస్ఫూర్తిని, భక్తిని, నీతిని సంశ్లేషమును అవలంబించును. రెండును అనుభవముద్వారా జ్ఞానమును చేరును. గీతాదృష్టిలో ఈరెండింటి బోధనలయందు భేదములేదు. గీతను ప్రత్యేక మతసాంప్రదాయముగను ఫలితముగను వచించు వేర్వేరు మతములతో మనకు ప్రసక్తిలేదు. దాని మూల మెట్టిదైనను, దానిబోధ విశ్వాత్మకము.

సత్యమునుగుఱించి గీత కావించిన తత్త్వవిచారణారచనా విధానములు అంత ముఖ్యములుకావు. అంతశాశ్వతములునుకావు. కాని గీతావిధానమున కంతర్భాగమైన అనేక సత్యాంశములు

ప్రధానభావములు అన్నియు కలిసి యొక బహ్వర్థక సామంజస్యమును శాశ్వతమగు విలువనుకలిగి జీవితమునకు అన్వయించ అనుకూలములైయున్నవి. ఏలన నివి తాత్త్వికబుద్ధియొక్క చింతనలు కావు. అవి ఆధ్యాత్మిక అనుభవముయొక్క దృఢసత్యములు; మన అంతఃకరణిక సాధ్యతలను తెలుపునట్టి ప్రాణికవిషయములు. ఉనికియొక్క రహస్యములను తెలిసికొనగోరువారు, ఈగ్రంథమును వదలజాలరు. దీని విధాన మెట్లున్నను దీనిని భాష్యకారులు చూపించ ప్రయత్నించినట్లుగా, అదియేయొక్క తత్త్వశాస్త్రమునకుగాని యోగశాస్త్రమునకుగాని సంబంధించదు. గీతయొక్క భావ, దాని చింతనానిర్మాణము, దాని భావసంయుక్తత, దాని భావసమన్వయిత యే ప్రత్యేక మతవిషయమునకుగాని అట్టిబోధకుని స్వభావమునకుగాని సంబంధించవు. లేక సత్యముయొక్క ఒక అంశమును తీసికొని మిగతవానిని పోద్రోయు తార్కికునికి అంతకును సంబంధించవు. కాని సర్వమును పరివేష్టించు విశాల తరంగములవలె ఈభావములు సర్వమును సంయోజన మొనరించు విస్తృతబుద్ధిని, సమృద్ధానుభవమును ఆవిర్భవింప చేయుచున్నవి. జ్ఞాన ప్రవృత్తులను మతవిషయకానుభవములను సృష్టించుటయందు సమృద్ధముగ నున్నదై ప్రతియొక్కమార్గమును దాని అంత్యమును చేరువఅకును పరీక్షించుచునుండు భారతీయ-ఆధ్యాత్మికత, అది సృష్టించిన అనేకసమన్వయ విధానములలో, గీతయొకటి. అది దేనినికాని ఛేదించక, ప్రతిదానికిని దానిదాని స్థానము నిచ్చి ఐక్యమొనరించును.

శాశ్వత నిర్వికార విశుద్ధపరమాత్మ సమస్తవిశ్వపు టునికికి ఆధారమని గీతాచింతన బోధించినను, అది అద్వైతముకాదు. ఈ సృష్ట్యాత్మక ప్రపంచమునందు సర్వగతమైన ప్రకృతియొక్క మూడు గుణములను మాయయని గీతచెప్పినను, అది మాయావాద

ము కాదు. అద్వైతైక పరాత్పరునియందు, జీవరూపమున ఆవిర్భూతమైన పరాప్రకృతి వసించుననియు, విలీనమై పోవుటకుబదులు ప్రత్యేకత్వమును కలిగి భగవంతునియందు వసించుటయే యున్నత ఆధ్యాత్మికచేతన యనియు గీత చెప్పినను, అది విశిష్టాద్వైతము కాదు; పురుషప్రకృతు లనెడి సూత్రము నవలంబించి ప్రపంచ సృష్టిని వివేచించినను, అది సాంఖ్యము కాదు. పురాణముల ననుసరించి విష్ణువుయొక్క అవతరణయే కృష్ణుడనియు, అతడే పరాత్పరుడనియు,అనిర్దేశ్యము నిరపేక్షమునగు బ్రహ్మ, ఆ విశ్వేశ్వరుడగు పురుషోత్తమునికన్న ఉన్నతము కాదనియు గీతవచించినను, అది వైష్ణవుల ఈశ్వరవాదము కాదు. గీతకు పూర్వము ఉపనిషత్తులు సమస్త ఆధ్యాత్మిక అనుభవములను సమన్వయపరచినట్లువలె నిదియును సమస్త ఆధ్యాత్మిక అనుభవములను సమన్వయపఱచినది. దీనిని ప్రస్థానత్రయములో నొకటిగ చేర్చి తమతమ మతములకు ప్రమాణములుగా తీసికొన్న భాష్యకారుల ఉద్దేశ్యములకును గీతోద్దేశ్యమునకును సంబంధము లేదు. గీత తర్కమున కుపయోగపడు పరికరము కాదు. ఆధ్యాత్మిక సత్యానుభవములుగల సర్వలోకములను మనల దర్శింపచేయు కవాటమది. అది పటమును నిర్మించును. కాని దాని గోడల నిర్మించి కంచెలువేసి మనదృష్టిని బంధించదు.

భారతీయ ఆధ్యాత్మిక చింతనయొక్క దీర్ఘచరిత్రయందు వితర సమన్వయములుకూడ గలవు. అవి వేదసమన్వయముతో ప్రారంభమయ్యెను. విశ్వదేవతల మహత్తుతో, పృథ్వీజీవితవిధానముతో,ఋషులు భాగస్వాములై దివ్యజ్ఞానశక్త్యానందములయొక్క ఉన్నతతమ ఉత్పతనమునలోనికి విస్తృతతమ శ్రేణులలోనికి తమ అంతఃకరణికసత్తను గొనిపోయినట్లు అందు వారు వచించిరి. మన భౌతికదృష్టికిని మనస్సునకును గుప్తముగా నుంచబడిన భౌతిక విశ్వసాంకేతికపదములను వానియందు వా రుపయోగించిరి. వేద

ఋషుల అనుభవమునందు ఈ సమన్వయముయొక్క ఫలము దివ్యమై అతీతమై ఆనందదాయకమై, ఆ ఐక్యానుభవమునందు అభివృద్ధి గాంచు మానవాత్మయు, విశ్వదేవతలయొక్క శాశ్వత దివ్యసంసిద్ధియు, పరస్పరము కలిసి తమ్ము పూర్ణముగావించుకొనెను. పూర్వ ఋషులయొక్క ఈ అనుభవమకుటమును ఉపనిషదృషులు చేకొని, ఆధ్యాత్మిక జ్ఞానసమన్వయమును మరల గావించిరి. అధ్యాత్మికాన్వేషణముయొక్క దీర్ఘకాలమునందు ఈ ఉపనిషదృషులు తమ అనుభవముల నన్నింటిని ఉపనిషత్తులయందు సమన్వయించిరి. ఈ వేదాంత సమన్వయమునుండి గీత మరల ప్రారంభించి ఆ భావముల పైన జ్ఞాన ప్రేమకర్మల మూడింటిని సమన్వయపఱచి మానవాత్మ శాశ్వతుని అందుకొనుమార్గము చూపెను. ఆధ్యాత్మికతను సమన్వయపఱచిన శ్రేణిలో వేదములు ఉపనిషత్తులు గీతతోపాటు, తాంత్రికముకూడ ఉన్నతస్థానమును ఆక్రమించినది. తంత్రమునుండియే పురాణగ్రంథములలోని సాంప్రదాయము లన్నియు సమృద్ధము నొందియుండునది. ఇది ఆధ్యాత్మికముగ నంతగంభీరము సూక్ష్మముగాకున్నను గీతాసమన్వయముకన్న శక్తిమంతముగను ధైర్యవంతముగను నున్నది. ఏలన ఆధ్యాత్మిక జీవితమునకు ప్రతిరోధముగా గలవానినికూడ నది స్వీకరించి ఆధ్యాత్మిక విజయమునకు దానిని సాధనగా జేసికొని సమస్తజీవితమును దివ్యలీలగా నది మార్చగలిగినది. కొన్నివిధముల అది అధికతర సద్యఃఫలితముల నిచ్చును. ఎందుకన అది దివ్యజ్ఞానముతో పాటు, దివ్యకర్మలను దివ్యప్రేమను హఠయోగ రాజయోగరహస్యములను,అన్ని భూమికలపై దివ్యజీవనమును తెఱచియుంచగల శరీర మానసిక తపస్సులను,ఉపయోగించును. వీనినన్నింటిని గీత కేవల సూచనమాత్రమే గావించినది. వేదఋషులు తెలిపియుండియు మధ్యకాలములో నితరులచే నేడి వెనుకకు త్రోయబడెనో చింతనానుభవోత్క్రాంతుల

యొక్క భవిష్యత్సమన్వయమున దేనికి స్థానమధికమో అట్టి దివ్య సంసిద్ధిని ఈ తంత్రవిధానము చేకొనెను.

ఇట్టినూతన విస్తృత సమన్వయమునకు గొనిపోవు నూతన యుగాగమనమును, మన మెదుర్కొనుచున్నాము. వేదాంత శాస్త్రమునకు ప్రస్తుతము బద్ధములైయున్న త్రిమతములనుగాని, లేక గతకాలపు ఈశ్వరవాదముతో కూడిన వివిధమతములలో నేదోనొకదానినిగాని, ప్రత్యేకముగ మేము అవలంబించ తలంచ లేదు. కడకు గీతచేమాత్రమే బద్ధులమైయుండుటకును మే మిష్ట పడము. ఏలయన, అట్లొనర్చుటచే మన స్వకీయ జ్ఞానసత్తా స్వభావములచేగాక నితరుల జ్ఞానసత్తాస్వభావములచే మమ్ము మనము బంధించుకొనినట్లగును. మనము గతకాల ప్రభాతములకు చెందిన వారము కాము. మనము భవిష్యత్కాల మధ్యాహ్న ప్రకాశములకు చెందినవారము. మనలోనికి నూతన విషయములు ప్రవహించుచున్నవి. మనము ప్రపంచముయొక్కయు హిందూదేశముయొక్కయు ఈశ్వరవాదము నంగీకరించు మతముల ప్రాభవమును, బౌద్ధమత నిజార్థమును, జీర్ణించుకొనుట మాత్రమేకాక ఆధునిక విజ్ఞానమును దాని సత్యాన్వేషణఫలితములను కూడ స్వీకరించవలయును. మనకు తెలియదని తలంచబడిన గతకాల జీవితము, దాని రహస్యములతో తెరవెనుకనుండి మరల మానవుని చేతనలోనికి చొచ్చుకొని వచ్చుచున్నది. దీనినిగూడా మనము స్వీకరించి ఒకనూతన సమృద్ధ సమన్వయమును చేయవలయును. ఇట్లుచేయుట భవిష్యత్కాలమునకు బౌద్ధికముగను ఆధ్యాత్మికముగను అత్యవసరము. కాని పూర్వసమన్వయములు ఒక్కొక్కటియును దాని దానికి పూర్వముననున్న సమన్వయములను ఆధారముగా తీసికొని నూతన స్థితికి తగినట్లుగ సమన్వయించినట్లే యీ భవిష్యత్సమన్వయము కూడ గతకాలమున జరిగినవాని నన్నింటి ఆధ్యాత్మిక అనుభవ

ములను చింతనలను ఆధారముగా నుంచుకొని దీని పూర్ణత్వమును నిర్మించుకొనవలయును. ఇట్టి భవిష్యత్సమన్వయమునకు ఆధారముగా గలవానిలో, గీతకుగల స్థానము చాలగొప్పది.

అందుచే గీతను పఠించుటలో మన ఉద్దేశ్యము, విద్యార్థి విమర్శకబుద్ధితో దాని చింతనను తెలిసికొనుట కాదు. లేక దాని దార్శనికసిద్ధాంతమును చారిత్రక మొనరించుటయు కాదు. లేక హేతువాదివలె దానిని తర్కించుటయు కాదు. దానివలన పొందగల సాహాయ్యమును, ప్రకాశమును, పొందుటకుమాత్రమే దానిని సమీపింతుము. అది మనకు నివ్వగల సజీవసందేశమును - మానవజాతి తన పూర్ణత్వమును, ఆధ్యాత్మికసుఖమును పొందుట కుపయోగపడగల సందేశమును-దానియందు గుర్తెఱుంగటకే దానిని మనము సమీపించుటలో మన ఉద్దేశ్యము.



# శ్రీ అరవింద లేఖ

## అతిమనఃతత్త్వము నన్వేషించు ఉద్దేశ్యము

[ఒకానొక సాధకుని లేఖకు, ప్రత్యుత్తరముగా శ్రీ అరవిందులు వ్రాసిన లేఖయిది. అతిమనఃతత్త్వమును— ఇదియొక యున్నతతర ఆధ్యాత్మిక చేతన—పృథ్వీపై స్థాపించుటలో, శ్రీకృష్ణుని కార్యమునే, శ్రీఅరవిందులు యెట్లు కొనసాగించుచుండునది, యీలేఖ తెలుపును. అందుచే దీని నిక్కడ ప్రచురించితిని.]

— ప్రకాశకులు

నీవు ఉదాహరించిన భావములతో నా ప్రాణశక్తి ప్రవర్తించు చుండుటలేదు. నే నన్వేషించునది, ఉన్నత సత్యమును; అది మానవులను గొప్పవారినిగా నొనర్చునా, కాదా, యను ప్రశ్న కాదిప్పుడు మనకు కావలసినది. కాని, అది ప్రపంచమునందు సత్యమును శాంతిని, ప్రకాశమును స్థాపించగలదా, జీవితమునుండి ఘర్షణ, అనృతము, బాధ, అజ్ఞానములను తొలగించ గలదా యనునదియే ప్రశ్న. అందుచే పూర్వులు కావించిన దానికన్న ఈకార్యములు తక్కువవియేయైనను, యీకార్యములు నెరవేరినచో, నాఉద్దేశ్యము నెరవేరినదే యనవలెను. ఆధ్యాత్మిక సాధనలను గురించి, మానసిక ఊహాలతో తృప్తిపడుట నా విధానము కాదు. అతిమనఃతత్త్వము, సత్యవిషయమనుట నాకు బాగుగా తెలియును.

వ్యక్తిగత ఔన్నత్యము కొఱకు, అతిమనస్సును స్థాపింప నేను ప్రయత్నించుటలేదు. మానవదృష్టితో పరికించబడునట్టి గొప్పతనము చిన్నతనములతో నాకు పనిలేదు. పృథ్వీచేతనలోనికి ఆంతరిక సత్యము ప్రకాశము సామంజస్యము శాంతి అను వీని నొసంగు తత్త్వమును గొని తెచ్చుటకు నే నన్వేషించుచుంటిని. నేనీ ఆధ్యాత్మిక తత్త్వమును నాయూర్ధ్వమున స్పష్టముగ చూచుచున్నాను; దాని స్వరూప స్వభావములు నాకు స్పష్టముగ గోచరించుచున్నవి. నా చేతనపై, అది నిరతము ఒఱగియుండుట నేననుభవించుచున్నాను; నా మానవచేతన, యిప్పటివలె పరికాశాప్రకాశములతో మిళితమై యుండుటకుబదులు, సమస్తము ఆ దివ్యతత్త్వముల లోని కీడ్వబడుటకు నేనన్వేషించుచుంటిని. ఈదివ్యతత్త్వావతరణము, పృథ్వీచేతనను పరిణామము కావించి పృథ్విపై దివ్యజీవితమును సాధించునని నేను విశ్వసించుచున్నాను. నాకన్న మహోన్నత పురుషులు నాకు పూర్వమీ దివ్య సందర్శనమును ఈ ఆదర్శమును కలిగియుండనిచో, నాకు గలిగిన ఈసత్యానుభవమును, ఈసత్య సందర్శనమును నేనేల అనుసరించకూడదో నాకు తెలియదు. శ్రీకృష్ణుడు * ప్రయత్నించనిదానిని నేను ప్రయత్నించు చుంటినని మానవులు నన్నవివేకుడు అని, తలంచుచో, నే నందులకు

---

* శ్రీకృష్ణుడు ప్రయత్నించని కార్యమును శ్రీఅరవిందులు ప్రయత్నించుటచేత, అది సాధ్యమా యని మానవుని బుద్ధికి తోచును. కాని మనము పృథ్విపై భగవంతుని అవతారములను వారి కార్యములను గమనించినచో, ప్రతి అవతార పురుషుడును, తత్పూర్వపు అవతారపురుషునిచే, చేయబడుట కవసరములేక, చేయబడకయుండినదానినే నెరవేర్చినట్లు అర్థమగుచున్నది. అందుచే, నీ అవతారపురుషులు ఒకరికన్న నొకరు యెక్కువని తలంచకూడదు; వీరందఱు ఒకేభగవంతునియొక్క స్వరూపులు; పృథ్వీచేతన

కినుక వహించను. ఈ విషయమునందు వేరొక వ్యక్తియొక్క ప్రసక్తి యెంతమాత్రము లేదు. ఇది, కేవలము నాకును, భగవానునికిని సంబంధించినది మాత్రమే—అది భగవానుని సంకల్పము కాదా యని మాత్రమే—ఆ దివ్య తత్త్వావతరణను సాధించుటకు నే నుద్దేశింపబడితినా కాదా యని మాత్రమే,—కడకు దానిని సాధ్య మొనరింప ఉద్దేశింపబడితినా కాదా యని మాత్రమే, యిప్పుడు నాకుగల ప్రశ్న. మానవు లందఱును నన్ను పరిహసించనీ గాక, నా అభ్యూహాకుగా నేను నరకకూపమున పడవేయబడుదునుగాక—విజయమో వినాశమో యగువఱకు నా కార్యమునందు నేను ముందుకే పోవుచుందును. అతిమనస్సును నేనీ భావముతోనే అన్వేషించుచుంటిని. నాకుగాని మరెవ్వరికిగాని, యిందులో గొప్పతనము కావలయునని నే కోరున దేదియులేదు.

౧౯౩౫ —శ్రీ అరవిందులు

---

కు అవసరమైన అయా చేతనాశక్తులను పృథ్వీలోనికి గొనితెచ్చిరి; పృథ్వీపరిణామము-ననుసరించి మునుపటిదానికన్న తర్వాతది అధికతరమైన చేతనాశక్తిగా కనపడవచ్చును. అంతమాత్రముచే వీరు యొకరికన్న నొకరు యెక్కువ కాదు: కాని, ఒకరికన్న నొకరు ఆ యేకైక భగవంతుని చేతనాశక్తులలో అధికతరమైనదానిని పృథ్వీచేతనయందు స్థాపించినవారే యగుదురు. అందుచే శ్రీకృష్ణుడు ప్రయత్నించనిదానిని, శ్రీఅరవిందులు ప్రయత్నించుటలో, ఆయేకైక భగవంతుని ఉద్దేశ్యమేమైయుండవలెను. అట్లైననే అది సాధ్యమగును; సాధ్యమగుచున్నదికూడ. కాలమే ఈవిషయమును ఋజువు చేయగలదు.

## మావద్ద యీక్రింది పుస్తకములు దొఱకును

౧. పూర్ణయోగము ... ... ౧-౪-౦

౨. ఇంపుకథలు ... ... ౧-౮-౦

౩. ప్రార్థనలు-ధ్యానములు ... ౧-౮-౦

౪. కర్మయోగియొక్క ఆదర్శము ... ౧-౮-౦

౫. జగన్నాథుని రథము ... ... ౧-౮-౦

౬. కాళిదాసు ... ... ౧-౦-౦

౭. శ్రీమాతారవింద సుభాషితములు ౦-౮-౦

౮. మెఱపులు-తలపులు ... ... ౦-౧౦-౦

దొఱకు స్థలము:

చి॥ నారాయణరెడ్డిగారు,

శ్రీఅరవిందాశ్రమము

పాండిచేరి.